ఓమ్

శ్రీ మలయాళసద్గురు పరబ్రహ్మణే నమః

# కైవల్యసాధని

## (జ్ఞానపాఠములు)

ఈ గ్రంథము భక్తులు, ముముక్షువులున్ను తప్పక కంఠస్థము చేయదగినది.



గ్రంథకర్త

శ్రీ చిన్మయ రామదాసు

# విషయసూచిక

పుట



శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ గణేశాయ నమః శ్రీ శారదామాతాయై నమః

# కైవల్యసాధని

## ( జ్ఞానపాఠములు )

## దైవప్రార్థన

శ్లో. నారాయణో జగన్నాథో వారిజాసన వందితః
స్వామి పుష్కరిణీవాసో శంఖచక్రగదాధరః
పీతాంబరధరో దేవో గరుడాసన శోభితః
విశ్వాత్మా విశ్వరూపో విజయో వేంకటేశ్వరః ॥

శ్లో. మహాలక్ష్మ్యై వరలక్ష్మ్యై మోక్షలక్ష్మ్యై సదాశ్రియై
విష్ణుపార్శ్వ నివాశిన్యై రాజ్యలక్ష్మ్యైశ్చ మంగళం
లక్ష్మీవదన సౌందర్య, సుధోదధి కృతోదయః
కల్పవృక్ష కటాక్షాత్మా, కాంక్షితాని కరోతునః ॥

# 1. జీవితోద్దేశ్యము : జన్మధర్మము

శ్లో. జీవితం యస్యధర్మార్థం । ధర్మోజ్ఞానార్థమేవచ
జ్ఞానం చ ధ్యానయోగార్థం । సోచిరాన్ముచ్యతే నరః ॥

తా. ధర్మము తప్పక ప్రవర్తించుటకుగాను మన జీవితము వచ్చినది. ధర్మప్రవర్తన యనునది నిత్యానిత్య (ఆత్మానాత్మ) వివేకజ్ఞానము గలుగుట కొఱకు అనుష్ఠింపబడుచున్నది. వివేకజ్ఞానము పరమాత్మ ధ్యానము చేయుటకుగాను యేర్పడినది. పరమాత్మ ధ్యానముచేతనే, అనాత్మరూపములైన కామక్రోధములు, అహంకార మమకారములు, సత్త్వరజస్తమో గుణములు నశించి పునరావృత్తిరహితమైన మోక్షసుఖము కలుగును.

ధర్మ (పుణ్య) వర్తనగలవారికే వివేకజ్ఞానము గలుగును. వివేకజ్ఞానముకలవారికే పరమాత్మ ధ్యానము కుదురును. పరమాత్మనిష్ఠగలవారే కైవల్యమోక్షము నొందుదురు.

శ్లో. అత్రాహారార్థం కర్మకుర్యా దనింద్యం
కుర్యాదాహారం ప్రాణసంధారణార్థం
ప్రాణాస్సంధార్యాస్తత్త్వ సంపాదనార్థం
తత్త్వం సంపాద్యం యేన భూయో నజన్మ ॥

తా. ఆహారమును సంపాదించుకొనుటకుగాను పాపములేని న్యాయవృత్తిని అవలంబించవలయును. ప్రాణమును నిలబెట్టుకొనుటకుగాను ఆహారమును భుజించ

వలయును. ఆత్మ తత్త్వ జ్ఞానమును సంపాదించుకొనుటకు గాను ప్రాణమును ధరించి యుండవలయును. పునర్జన్మ రహితమైన మోక్షము నొందుటకుగాను గురూపదిష్ట వేదాంత శాస్త్ర శ్రవణ మనన (విచారణ) బ్రహ్మధ్యానముల ద్వారా ఆత్మసాక్షాత్కార జ్ఞానానుభూతిని సంపాదించుకొనవలయును. ఇదియే మానవజన్మయొక్క సంపూర్ణ కర్తవ్యానుభవము, జన్మసార్థకతయు నగును.

## 2. త్రికరణ సత్కర్మలు

శ్లో. దేవ ద్విజ గురు ప్రాజ్ఞ, పూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ, శారీరం తప ఉచ్యతే ॥

తా. దేవతలను పూజించుట, పరమభక్తులను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను సేవించుట, పరిశుభ్రముగా నుండుట, నిష్కపటముగా వర్తించుట, బ్రహ్మచర్యవ్రతమును పాలించుట, ఇతర మానవాది ప్రాణులకు బాధగలుగకుండునట్లు ప్రవర్తించుటయును శరీరముతో చేయబడు తపస్సు యగును. ( దేహముతో చేయబడు సత్కర్మలు )

శ్లో. అనుద్వేగకరం వాక్యం, సత్యం ప్రియహితంచయత్
స్వాధ్యాయాభ్యసనంచైవ, వాఙ్మయంతప ఉచ్యతే ॥

తా. ఇతరులకు బాధ గలుగకుండునట్లు మాట్లాడుట, సత్యము పలుకుట, ఇతరులకు ప్రియము మేలును కలుగునట్లు మాట్లాడుట, భగవద్గీతపారాయణ, భగవన్నామ సంకీర్తనల జేయుటయును వాక్కుతో చేయబడు తపస్సు ( సత్కర్మలు )

శ్లో. మనఃప్రసాదస్సౌమ్యత్వం, మౌనమాత్మ వినిగ్రహః
భావ సంశుద్ధి రిత్యే తత్తపోమాన సముచ్యతే॥

తా. మనస్సులో దుర్గుణములను లేకుండ జేసికొనుట, మనస్సును సంతోషముగా నుంచుకొనుట, మనస్సును చంచలము గానీయక నిశ్చలముగా నుంచుకొనుట, ఆత్మ భావముతో, సమత్వదృష్టితో నుండుటయు 'మానసిక తప' స్సనబడును.

## 3. త్రికరణ దుష్కర్మలు

శ్లో. అభక్షస్య భక్షణం హింసా, మిథ్యాకార్యనివేశనమ్
పరస్వానా ముపాదానం, చతుర్ధా కర్మ కాయికమ్ ॥

తా. (1) తినరాని పదార్థములను తినుట (2) ఇతర మానవాది ప్రాణులకు బాధలు కలిగించుట (3) అనవసర పనులను చేయుట (4) పరుల సొత్తును స్వీకరించుట (దొంగిలించుట)— ఈ నాలుగున్ను 'శరీరముతో చేయబడు పాప కార్యము' లనబడును.

శ్లో. అవిబద్ధ ప్రలాపత్వ మసత్యం చా ప్రియంచయత్
పరోక్షతశ్చపైశున్యం, చతుర్ధా కర్మవాచికమ్ ॥

(1) తా. వ్యర్థముగా మాట్లాడుట (2) అసత్యము పలుకుట (3) ఇతరులకు బాధకలుగునట్లు (కఠినముగా) మాట్లాడుట (4) చాటున చాడీలు చెప్పుటయు 'వాక్కు చేయు చెడ్డపను' లనబడును.

శ్లో. పరస్త్రీ ద్రవ్యసంకల్ప శ్చేతసాఽనిష్టచింతనం
అకార్యాభినివేశశ్చ చతుర్థా కర్మమానసమ్ ॥

తా. (1) పరస్త్రీపై మోహము చూపుట (2) పరుల సొమ్ము రావలెనను ఆశ గలిగియుండుట (3) ఇతరులకు అపకారముచేయ దలచుట (క్రోధము, ద్వేషము గలిగి యుండుట) (4) చేయరాని పనులను చేయవలెనను పట్టుదల గలిగియుండుటయు 'మనస్సుతో చేయబడు పాపములు.'

## 4. త్రికరణ పాపఫలము

శ్లో. శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః
వాచికైః పక్షి మృగతాం మానసైరంత్యజాతిజామ్ ॥

తా. మానవులు శరీరముతో పాపములను చేసినచో చెట్లుగాను, పర్వతములుగాను పుట్టుదురు. వాక్కుతో (మాటలతో) పాపములను చేసినచో పక్షులుగాను, మృగములుగాను పుట్టుదురు. మనస్సుతో పాపములను చేసినచో దరిద్రులుగాను, దుఃఖవంతులుగాను పుట్టుదురు. కనుక శరీరముతోను, వాక్కుతోను, మనస్సుతోను పాపము గలుగు పనులను చేయక, పుణ్యమగు పనులను చేయుట 'మానవ ధర్మమగు'నని తెలియవలెను.

## 5. అజ్ఞాన నిద్రనుండి జీవుని మేల్కొలుపు శ్లోకములు

శ్లో. మాతా నాస్తి పితా నాస్తి, నాస్తి బంధు స్సహోదరః
అర్థం నాస్తి గృహం నాస్తి, తస్మా జ్జాగ్రత జాగ్రత ॥

తా. యథార్థ దృష్టిలో మన శరీరాదీంద్రియములే అశాశ్వతములు కనుక తల్లి, తండ్రి, బంధువులు, సోదరులు, ధనము, గృహములును అనిత్యములైనవే యగును. అందు వలన పాపకార్యములలో చిక్కక, నిష్కామ పుణ్యకర్మలను చేయుటలో శ్రద్ధగలిగి యుండుము. అనిత్యభ్రాంతులలో మునిగియుండక పరమాత్మను దృష్టియం దుంచుకొను విషయములో జాగ్రత గలిగియుండుము.

శ్లో. జన్మ దుఃఖం జరా దుఃఖం, జాయా దుఃఖం పునః పునః
సంసారసాగరం దుఃఖం, తస్మా జ్జాగ్రత జాగ్రత ॥

తా. జన్మమెత్తుట దుఃఖకరమైనది. పెండ్లిచేసుకొనుట దుఃఖము కలుగుటకు కారణ మగును. ధనము, గృహము, పశువులు, భూములు, బిడ్డలు మొదలగువానితో గూడిన సంసారమును దుఃఖము గలిగించునదే యగును. ముసలితనము మరణమును, దుఃఖమును, గలిగించును. అందువలన జన్మ రాహిత్యమగు మోక్షమార్గమున నడచు విషయములో మిక్కిలి జాగ్రత గలిగియుండుము. తప్పక జాగ్రత్తగా సన్మార్గమును అనుసరించుము.

శ్లో. ఆశయా బధ్యతే లోకః, కర్మణా బహుచింతయా
ఆయుః క్షీణం న జానంతి, తస్మా జ్జాగ్రత జాగ్రత ॥

తా. మానవులు ఆశకు దాసులై, కర్మలచేత అనేక చింతలు గలవారై ఆయువు నశించిపోవుచున్న విషయమును తెలిసికొనక యున్నారు. అందువలన ధర్మమును, దైవమును మరువజాలక జాగ్రత గలిగి యుండవలెను. జాగరూకులై మెలగవలెను.

శ్లో. సంపదస్స్వప్నసంకాశా, యౌవనం కుసుమోపమమ్
విద్యుచ్చంచలమాయుష్యం, తస్మా జ్జాగ్రత జాగ్రత॥

తా. ధనధాన్యాది సంపదలన్నియు స్వప్నములో కనబడు విషయులవలె నశించిపోవునవే యగును. యౌవన శోభ పుష్పమువలె నశించును. ఆయువు మెరుపువలె చంచలమైనది. అందువలన పుణ్యము నార్జించుకొను విషయములో జాగ్రత గలిగియుండుము. ఆత్మభావమును జాగ్రతగా కాపాడుకొనుచుండుము.

శ్లో. క్షణం విత్తం, క్షణం చిత్తం, క్షణం జీవిత మావయోః
యమస్య కరుణా నాస్తి, తస్మా జ్జాగ్రత జాగ్రత॥

తా. ధనము, కాంక్షలు (చిత్తవికారములు), జీవిత కాలమును స్థిరములైనవికావు. ఎప్పటికైనను మరణము తప్పదు. అందువలన, దేనిని నమ్మక భగవంతునినే నమ్మియుండిజాగ్రత్తగా సత్కర్మలను చేయుచుండుము. జాగ్రత్తగా సత్యము, శాంతము, దయ మొదలగు సద్గుణములను కాపాడుకొనుచుండుము.

శ్లో. కామః క్రోధశ్చ లోభశ్చ, దేహే తిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ, తస్మా జ్జాగ్రత జాగ్రత॥

తా. దేహములో కామము, క్రోధము, లోభము (దురాశ) అనెడి ముగ్గురు దొంగ లుండి వివేకజ్ఞానము, భగవద్ధ్యానస్మరణానందములను పొందనీయక హరింపజేయు చున్నారు. కనుక భక్తులారా! ముముక్షువులారా! కామ, క్రోధ, లోభ గుణములను పుట్టనీయక నశింపజేయుచు

జాగ్రత్తగా జప, ధ్యాన, స్మరణ, వివేకజ్ఞానములను కాప
కొనుచుండవలెను. మెలకువతో నుండవలెను.

## 6. దుఃఖనివృత్తి బోధన శ్లోకములు

శ్లో. యావత్కాలం భవేత్కర్మ, తావత్తిష్ఠంతి జంతవః
తస్మిన్ క్షీణే వినశ్యంతి, కాతత్ర పరిదేవనా ॥

తా. పుణ్య పాపకర్మల ఫలిత మున్నంతవ
మానవాదిజీవులు జీవించి యుందురు. కర్మ నశించిన వెంట
మరణింతురు. కనుక, మరణించినవారిని గురించి దు
పడు టెందుకు?

శ్లో. ఋణానుబంధరూపేణ, పశు పత్నీ సుతాదయః
ఋణ క్షయే క్షయం యాంతి, కాతత్ర పరిదేవనా ॥

తా. మానవులు పూర్వజన్మమున జేసికొ
ఋణమువలన ఈ జన్మమున భార్య, పుత్రులు, పశువు
ధనము, భూములు, గృహములును ప్రాప్తించుచున్న
ఋణము తీరిన వెంటనే వానితో సంబంధము తెగిపోవుచున్న
అందువలన దుఃఖపడిన లాభమేమి గలుగును?

శ్లో. పక్వాని తరు పర్ణాని, పతంతి క్రమశో యథా
తథైవ జంతవఃకాలే, కాతత్ర పరిదేవనా ॥

తా. వృక్షముల యొక్క ఆకులు పండినపుడు క్రమము
అన్నియు రాలిపోవునుగదా! ఇట్లే ఆయువు క్షీణించిన కాలవ
వచ్చినపుడు మానవాది ప్రాణులు మరణించును. అందుల
ఏడువనేల?

శ్లో. ఏకవృక్షసమారూఢా, నానాజాతి విహంగమాః
ప్రభాతే విదిశో యాంతి, కాతత్ర పరిదేవనా ॥

తా. రాత్రిపూట అనేకరకములైన పక్షులు ఒక్క వృక్షముపై వ్రాలియుండును. తెల్లవారినవెంటనే ఆ పక్షులన్నియు నలుమూలలకు ఎగిరిపోవునుగదా! ఇట్లే ఒక గృహములో భార్య బిడ్డలు, బంధు మిత్రాదులును కలిసి కొంతకాలముండి తరువాత కర్మానుసారముగా ఎవరిదారిని వారే పోవుచుందురు (మరణింతురు). ఆ విషయమై శోకింపనేల?

శ్లో. ఇదం కాష్ఠ మిదం కాష్ఠం, నద్యాం వహాతి సంగతః
సంయోగాచ్చ వియోగాచ్చ, కాతత్ర పరిదేవనా ॥

తా. ఒకవైపునుండి ఒక కర్ర, రెండవవైపునుండి ఇంకొక కర్రయు కొట్టుకొనివచ్చి నదిలో ఏకమై ప్రవాహములో జతగా పోవుచు కొంతదూరమైన తరువాత విడిపోవును గదా! ఇట్లే భార్యాభర్తలుకూడ చెరియొకవైపు నుండి వచ్చి ఒక గృహములో ఏకముగా జతగానుండి, కొంత కాలమైన తరువాత వారివారి కర్మానుసారముగా విడిపోవుచుందురు (చనిపోవుదురు). ఆ వియోగమునకు దుఃఖపడనేల?

శ్లో. మాతాయది విషం దద్యాత్, పితా విక్రయతే విజం
రాజా హరతి సర్వస్వం, కాతత్ర పరిదేవనా ॥

తా. విపరీత కర్మకాలము వచ్చినపుడు తల్లియే విషము పెట్టును. తండ్రీ అమ్మివేయును, సర్వమును రాజు తీసికొనిపోవును. ఆ విషయమై ఏడ్వనేల?

## 7. యమము

శ్లో. అహింసా సత్య మస్తేయం, బ్రహ్మచర్యం దయార్జవమ్
క్షమా ధృతి ర్మితాహారః శౌచం చేతి యమాదశ ॥

తా. (1) అహింస (2) సత్యము (3) అస్తేయము (4) బ్రహ్మచర్యము (5) దయ (6) ఆర్జవము (7) క్షమ (8) ధృతి (9) మితాహారము (10) శౌచము —ఈ పదియు 'యమము' యనబడును.

## 1. అహింస

శ్లో. కర్మణా మనసా వాచా, సర్వభూతేషు సర్వదా
అక్లేశ జననం ప్రోక్తా త్వహింసా పరమర్షిభిః ॥

తా. శరీరముతోను, వాక్కుతోను, మనస్సుతోను ఎన్నడును ఏప్రాణికిన్ని బాధగలిగించ కుండుట 'అహింస' యని మహర్షులు చెప్పిరి.

## దయ

శ్లో. పరేవా బంధువర్గేవా మిత్రేద్వేష్టరివా సదా
ఆపన్నే రక్షితవ్యం తు దయైషా పరికీర్తితా ॥

తా. ఇతరులుగాని, బంధువులుగాని, మిత్రులుగాని ద్వేషించినవారుగాని, శత్రువులుగాని ఆపత్కాలములో నున్నవారై రక్షించవలసినదని మనలను ఆశ్రయించి నపుడు శక్తికొలది న్యాయవిరుద్ధముగాని సహాయము చేయుట 'దయ' యనబడును.

## కరుణ

శ్లో. ఆర్తేషు చ దరిద్రేషు పీడితేషు చ దుఃఖిషు
దీనానాథేషు చాత్యన్తం దయాయోగం సమాచరేత్ ॥

తా. ఆర్తులయందును (జంతువర్గాదులచే బాధపడు చున్నవారి యందు), దరిద్రులయందును, రోగాదులచే పీడింపబడుచున్నవారి యందును, మనశ్శాంతిలేక దుఃఖపడుచున్న వారి యందును, దిక్కులేనివారి యందును గాఢమగు దయను చూపుట 'కరుణ' యనబడును.

## భక్తి

శ్లో. సర్వభూతేషు కారుణ్యం ప్రియభాషణమేవ చ
సర్వభూత హితే శ్రద్ధా సాహ్యాద్భక్తి శివస్యతు ॥

తా. అన్ని ప్రాణులయందును దయగలిగి యుండుట, అందరకును ప్రియము, హితమును (మేలు) గలుగునట్లు మాట్లాడుట, అన్ని ప్రాణులును సౌఖ్యము నొందుటకు శ్రద్ధగలిగియుండుటయును 'భక్తి' యగునని శివుడు చెప్పెను.

విశేషార్థము : ఇతర మానవాది ప్రాణులకు అపకారము చేయకుండుట 'అహింస' యనియు; బాధపడుచు ఆశ్రయించిన వారికి ఉపకారముచేయుట 'దయ' యనియు; బాధపడుచున్న వారిని స్వయముగాచూచి వారికి ఉపకార మొనర్చుట 'కరుణ' యనియు; మనోవాక్కాయములతో సర్వప్రాణులకును సేవ చేయుచుండుట 'భక్తి' యనియును సారాంశమును గ్రహించి ఆచరించుచుండుట మానవధర్మము.

## 2. సత్యము

శ్లో. యత్త్వ దుష్టేంద్రియై ర్దృష్టం, శ్రుతం వేదవిదాం వర
తస్యైవో క్తి ర్భవే త్సత్యం, విప్రతన్నాన్యథా భవేత్ ॥

తా. చూచినదానిని చూచినట్లుగ, విన్నదానిని విన్నట్లు, చేసినదానిని చేసినట్లుగ, తెలిసికొన్నదానిని తెలిసికొనినట్లుగను చెప్పుట. ఉన్నదున్నట్లు చెప్పుట, ఆడినమాట తప్పకుండుటయును ' సత్య ' మనబడును.

## 3. అస్తేయము

శ్లో. అన్యదీయే తృణే రత్నే, కాంచనే మౌక్తి కేపి చ
మనసాపి నివృత్తిర్యా త దస్తేయం విదుర్బుధాః ॥

తా. ఇతరుల వస్తువునం దేదైనను, అనగా గడ్డిపరక, రత్నము, ముత్యము మొదలైన ధనములు ఏవిన్ని. వారికి తెలియక తీసికొనకూడ దనెడి దృఢనిశ్చయముతో నుండుట 'అస్తేయ' మనబడును. (అనగా దొంగతనముచేయకుండుట యగును.)

శ్లో. ఇష్టా న్భోగాన్హి వో దేవా, దాస్యంతే యజ్ఞభావితాః
తైర్దత్తా నప్రదాయైభ్యో, యో భుంక్తే స్తేన ఏవసః ॥

తా. మానవులారా! పూజ, హోమాదులచే దేవతలను గౌరవించగా వారు మీకు వర్షాదులను కలుగజేసి మీకు ప్రియమైన భోగములను యివ్వగలరు. ఆ దేవతలిచ్చువాటిని మీరు తీసికొని మరల వారికి ప్రియమైన యజ్ఞములను చేయక, వారిచ్చిన భోగములను అనుభవించు

చున్నచో మీరు దొంగ లనబడుదురు. దేవతల సొమ్మును ఉచితముగా తీసికొనకుండుట కూడ 'అస్తేయ' మనబడునని గీతాశ్లోకము ద్వారా తెలిసికొనవలెను.

## 4. బ్రహ్మచర్యము

శ్లో. తద్భేదం త్రివిధం వక్ష్యే స్థూలం సూక్ష్మంచ కారణం
వ్యాయామః ప్రథమః ప్రోక్తః మనోనైర్మల్యకం తథా
ఆత్మశుద్ధిః తృతీయాంచ మోక్షస్సిధ్యతి తేఽనఘ
త్రివిధం బహ్మచర్యంచ సాధనీయం సదాజనైః ॥

తా. బ్రహ్మచర్యము స్థూలము, సూక్ష్మము, కారణము అని మూడు విధములుగా నుండునని చెప్పబడు చున్నది. వ్యాయామము (కసరత్తు) చేయుట మొదటి బ్రహ్మచర్యము. మనస్సులో కామ క్రోధ లోభాది దుర్గుణములను లేకుండ జేసికొనుట రెండవదియగు సూక్ష్మ బ్రహ్మచర్యము. ఆత్మను తెలియనీయక ఆచ్ఛాదించి యున్న అజ్ఞానావరణ దోషమును నశింపజేసికొనుట మూడ వదియగు కారణబ్రహ్మచర్య మనబడును. ఈ మూడు విధములైన బ్రహ్మచర్యములను ఎల్లప్పుడును మానవులు ఆచరణయం దుంచుకొనవలెను.

శ్లో. కాయేన మనసా వాచా నారీణాం పరివర్జనం
ఋతౌ భార్యాం వినా స్వస్య బ్రహ్మచర్యం పరంతథా॥

తా. శరీరముతోను, మనస్సుతోను, వాక్కుతోను స్త్రీని త్యజించుటయు, ఋతుకాలమందుమాత్రమే స్వభార్యతో రమించుటయును 'బ్రహ్మచర్య' మనబడును.

శ్లో. కాయేన మనసా వాచా, సర్వావస్థాసు సర్వదా
సర్వత్ర మైథునత్యాగో బ్రహ్మచర్యం ప్రచక్షతే ॥

తా. శరీరముతోను, మాటలతోను, మనస్సుతోను అన్ని వేళలయందు, అన్ని స్థలములలోను ఎల్లప్పుడు స్త్రీ (కామ) సంబంధము లేకయుండుట 'బ్రహ్మచర్య' మనబడును.

శ్లో. బ్రహ్మచర్యం ప్రతిష్ఠాయాం, వీర్యలాభో భవత్యపి
సురత్వం మానవో యాతి, చాన్తే యాతి పరాంగతిమ్ ॥

తా. బ్రహ్మచర్యవ్రతమును పాలించినచో, వీర్య లాభము గలిగి మానవునకు దేవత్వము ప్రాప్తమై సాధన చతుష్టయసంపత్తి పరిపూర్ణత నొంది పరమగతి లభ్య మగును.

## 5. దయ

శ్లో. ఆత్మవత్సర్వభూతేషు, కాయేన మనసా గిరా
అనుకంపా దయాసైవ, ప్రోక్తా యోగాంగవేదిభిః ॥

తా. శరీరముతోను, వాక్కుతోను, మనస్సుతోను ఇతర మానవాదిప్రాణులను తన ఆత్మ (ప్రాణము) తో సమముగా చూచుకొనుచుండుట 'దయ' యగునని వేద వేత్తలు చెప్పిరి.

"దాక్షిణ్యం ధర్మనాశనమ్"

అనుట వలన ధర్మమునకు మించిన (ధర్మవిరుద్ధమైన) దయను చూపరాదు.

## 6. ఆర్జవము (అపరిగ్రహము)

శ్లో. అనాగతానాం భోగానా మవాంఛన మకృత్రిమం
ఆగతనాం చ సంభోగం ఇత్యపరిగ్రహ లక్షణమ్॥

తా. లభించనివాటిని ఏవిధముగానైనను కోర కుండుటయును, అప్రయత్నముగా లభించినవాటిని తనకు అవసరమైనంతవరకే తీసికొనుటయును 'అపరిగ్రహ' మనబడును.

శ్లో. పుత్రే మిత్రే కళత్రే చ, రిపౌ స్వాత్మని సంతతమ్
ఏకరూపం మునే యత్త దార్జవం ప్రోచ్యతే బుధైః॥

తా. పుత్రులను, మిత్రులను, భార్యను, శత్రువును తనతో సమముగా ఎల్లప్పుడు ఏకైకభావముతో (అనగా భేదబుద్ధి, కపటము లేకుండ) చూచుకొనుచుండుట 'ఆర్జవ మగు' నని జ్ఞానులు చెప్పిరి.

## 7. తితిక్ష (ఓర్పు)

శ్లో. ఆధ్యాత్మికాది య ద్దుఃఖం ప్రాప్తం ప్రారబ్ధవే గతః
అచిన్తయా తత్సహానం తితిక్షేతి ప్రచక్షతే॥

తా. ప్రారబ్ధకర్మవిశేషము వలన కామ క్రోధ భయాది వికారములచేతను, తేలు పాము దొంగలు మొదలగు జంతువులచేతను, అగ్ని పిడుగులు గాలివాన మొదలైన దైవ సంబంధముచేతను గలుగు దుఃఖములను చింతనచేయక సహించుట 'తితీక్ష' యనబడును.

శ్లో. కాయేన మనసా వాచా శ్రుతిభిః పరిపీడ్యతే
చిత్తక్షోభ నివృత్తిర్యా క్షమాసా మునిపుంగవ॥

తా. శరీర సంబంధముగాను, మాటల సంబంధము చేతను, మానసిక వికారముల చేతను, చెవులకు వినబడు శబ్దముల చేతను బాధలు గలిగినను చిత్తము భయపడకుండుట, భ్రాంతులలో పడకుండుట 'తితిక్ష' యనబడును.

"సహనం సర్వదుఃఖానాం తితీక్షసా శుభామతా"

తా. వచ్చిన, వచ్చుచున్న సర్వదుఃఖములను సహించుట 'తితీక్ష' యనబడును.

## 8. ధృతి

శ్లో. వేదాదేవ వినిర్మోక్షస్సంసారస్య నచాన్యథా
ఇతి విజ్ఞాన నిష్పత్తిర్ధృతిః ప్రోక్తాహి వైదికైః ॥

తా. ఈ సంసార దుఃఖము, వేదాంత శాస్త్రములలో చెప్పబడిన ఆత్మజ్ఞానము చేతనే నశించునుగాని, యితర ఉపాయములచేత నశించదనెడి దృఢనిశ్చయమే 'ధృతి' (ధైర్యము) యనబడును.

## 9. మితాహారము

శ్లో. అల్పమృష్టాశనాభ్యాంతు, నాస్తియోగం కథంచన
తస్మాద్యోగానుగుణ్యేన, భోజనం మితభోజనమ్ ॥

తా. మరీ స్వల్పముగా భుజించినయెడల పరమాత్మ ధ్యానము కుదురదు. కనుక, పరమాత్మధ్యానము చేయుటకు అనుకూలముగా నుండుటకు తగిన ఆహారమును భుజించుట 'మితాహార' మనబడును.

## 10. శౌచము

శ్లో. అద్భిర్వా భస్మనా వాపి, మలానా మపకర్షణం
దేహశుద్ధి ర్భవేత్యేవ, బహిశ్శౌచం తదుచ్యతే ॥

తా. నీళ్ళచేగాని, భస్మముచేగాని దేహమందుగల మాలిన్యమును శుభ్రపరచుట 'దేహశుద్ధి' యనబడును. ఇదియే బాహ్యశౌచము.

శ్లో. మనశ్శౌచం కర్మశౌచం కులశౌచం చ భారత
శరీరశౌచం వాక్శౌచం శౌచ పంచవిధం స్మృతమ్ ॥

తా. (1) మనస్సులో కామక్రోధాది దుర్గుణములను లేకుండ జేసికొనుట 'మనశ్శౌచము' (2) చెడుపనులను చేయకుండుట 'కర్మశౌచము' (3) కులధర్మమును తప్పక ప్రవర్తించుట 'కులశౌచము' (4) శరీరమును పరిశుభ్రముగా నుంచుకొనుట 'శరీరశౌచము' (5) ఇతరులకు బాధలు గలుగు మాటలను పలుకకుండుట 'వాక్శౌచము'. ఈవిధముగా శౌచము ఐదు విధములుగ నుండునని చెప్పబడుచున్నది.

శ్లో. న శరీర మలత్యాగాత్, నరో భవతి నిర్మలః
మానసే తు మలేత్యక్తే తతో భవతి నిర్మలః ॥

తా. సబ్బు, సున్నిపిండి మొదలైనవాటితో దేహమును శుద్ధిజేసికొనినంతమాత్రమున మానవుడు మలినరహితుడు కాజాలడు. మనస్సులోగల అజ్ఞానమనెడి (దుర్గుణములనెడి)

మాలిన్యమును జ్ఞాన మనెడి సబ్బుతో కడిగివేసికొనిన మాత్రమే మానవుడు నిజమైన శుద్ధుడగును.

శ్లో. జలస్నానం మలత్యాగం, మంత్రస్నానం మన శ్శుచిః
భస్మస్నానం హరేత్పాపం, జ్ఞానస్నానం పరంపదమ్ ॥

తా. జలస్నానముచే శరీరముపైగల మురికి పోవును. శివ, రామ, కృష్ణాది మంత్రములను జపించుచుండుటవలన మనస్సు మలినరహిత మగును, శరీరముపై విభూదిని పూసి కొనుటవలన పాపములు నశించును. ఆత్మజ్ఞాన మనెడి గంగలో స్నానము చేసినచో మోక్షసుఖము గలుగును.

శ్లో. సత్యంశౌచం తపశ్శౌచం శౌచ మింద్రియనిగ్రహః
సర్వభూత దయా శౌచం, జలశౌచం చ పంచమమ్ ॥

తా. సత్యము పలుకుట శౌచము. తపస్సుచేయుట శౌచము. ఇంద్రియములను చెడువిషయములలోనికి పోనీయక నిగ్రహించుట శౌచము. సమస్తప్రాణులయందును దయగలిగి యుండుట శౌచము. జలముతో స్నానము చేయుట 'ఐదవశౌచ' మనబడును.

## 8. నియమము

శ్లో. తపస్సంతోష మాస్తిక్యం, దాన మీశ్వర పూజనమ్
సిద్ధాంతవాక్యశ్రవణం, హ్రీ ర్మతిశ్చ జపోవ్రతమ్ ॥

తా. 1. తపస్సు 2. సంతోషము 3. ఆస్తిక్యము 4. దానము 5. ఈశ్వరపూజ 6. సిద్ధాంతవాక్యశ్రవణము

7. హ్రీ (లజ్జ) 8. మతి 9. జపము 10. వ్రతము —ఈ పదియు 'నియమ' మనబడును.

## 1. తపస్సు

శ్లో. బ్రహ్మచర్యం తథామౌనం, నిరాహారత్వమేవచ
అహింసా సర్వత శ్శాంతి, స్తప ఇత్యభిధీయతే ॥

తా. కామభోగమునకు లోబడకుండుటయును, మౌన వ్రతములు చేయుటయును, ఉపవాసవ్రతములు చేయుట యును, ఏప్రాణికిని బాధగలిగించకుండుటయును, ఎల్లప్పుడు అన్నిచోట్ల ప్రశాంత హృదయముతో నుండుటయును 'తప'స్సని చెప్పబడును.

## 2. సంతోషము

శ్లో. యదృచ్ఛాలాభతోనిత్యం, ప్రీతిర్యాజాయతే నృణాం
తత్సంతోషం ద్విజాః, ప్రాజ్ఞా పరిజ్ఞానైక తత్పరాః ॥

తా. కోరనిదే మంచిగాని (సుఖముగాని), చెడుగాని (దుఃఖముగాని) లభించినపుడు సంతోషమును, క్లేశమును పొందకుండుట యేది గలదో, అదియే 'సంతోష' మని బ్రహ్మజ్ఞానులు చెప్పుచున్నారు.

శ్లో. సంతోషామృత తృప్తానాం, యత్సుఖం శాంతచేతసామ్
కుత స్తద్ధనలుబ్ధానా, మిత శ్చేతశ్చ ధావతామ్ ॥

తా. సంతోష మనెడి అమృతమువలన తృప్తులగు శాంతహృదయులకుగల సుఖము వంటి సుఖము 'ఇది

కావలెను, అది కావలెను ' అని తిరుగుచుండు ధనలోభుల కెట్లు లభించును! అనగా, ఆశలతో నున్నవారికి సంతోషము స్థిరముగా నిలువదని తాత్పర్యము.

## 3. ఆస్తిక్యము

"శ్రౌతే స్మార్తేచ విశ్వాసో యత్ర దాస్తిక్య ముచ్యతే."

తా. వేదమునందును, శాస్త్రమునందును, ఈశ్వరుని యందును, సద్గురువునందును గల దృఢవిశ్వాసమునకు (నిర్మల భక్తికి) 'ఆస్తిక్య' మని చెప్పుదురు. నాస్తికత్వ మేదనగా,

శ్లో. దేవో నాస్తి తపో నాస్తి, స్వర్గో నరక ఏవవా
మోక్షోపి నాస్తి విజ్ఞానం నాస్త్యిత్యేవ విచింత్యతామ్ ॥

తా. దేవుడు లేడు. తపస్సు లేదు. స్వర్గము, నరకమును లేవు, మోక్ష మనునదియు, ఆత్మవిజ్ఞాన మనునదియు కల వనుట వట్టిదే అని ఈవిధముగా చెప్పువారు (తలంచువారు) 'నాస్తిక' లనబడుదురు.

## 4. దానము

శ్లో. న్యాయార్జిత ధనం శాంతే, శ్రద్ధయా వైదిక ద్విజే
అన్యద్వా యత్ప్రదీయేత, తద్దానం ప్రోచ్యతే బుధైః ॥

తా. న్యాయమైన వృత్తితో సంపాదింపబడిన ధనమును శాంతులైన బ్రహ్మనిష్ఠులకు శ్రద్ధాభక్తులతో ఇచ్చుటయే 'దాన' మనబడును.

## 5. ఈశ్వరపూజనము

శ్లో. స్తుతి స్మరణ పూజాభిః, వాఙ్మనః కాయ కర్మభిః
సునిశ్చలాభవే ద్భక్తిః, ర్యేత దీశ్వర పూజనమ్ ॥

తా. భగవంతునిపై సునిశ్చలమైన భక్తినుంచి శరీరముతో పూజ, వాక్కుతో స్తుతి, మనస్సుతో స్మరణము (జపమును) చేయుచుండుటయే 'ఈశ్వరపూజ' యనబడును.

## 6. సిద్ధాంతశ్రవణము

శ్లో. సత్యం జ్ఞాన మనంతం చ, పరానందం ధ్రువం పరమ్
ప్రత్యగి త్యవగంతవ్యం, వేదాంత శ్రవణం బుధాః ॥

తా. సద్గురువువద్ద సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మానందము, నిశ్చలము, శ్రేష్ఠము నగు పరబ్రహ్మమే తాను యను విషయమును తెలిసికొని జ్ఞప్తియందుంచుకొనుటయే 'సిద్ధాంత (వేదాంత) శ్రవణ' మనబడును.

## 7. హ్రీ (లజ్జ)

శ్లో. వేద లౌకిక మార్గేషు, కుత్సితం కర్మయద్భవేత్
తస్మి న్భవతియా లజ్జా, హ్రీస్తుసైవ ప్రకీర్తితా ॥

తా. వేదశాస్త్రధర్మమార్గములందును, లోక (సంసార) సంబంధ కర్మలయందును చేయకూడని పనులలో గలిగెడు లజ్జ యేది గలదో దానిని 'హ్రీ' యని చెప్పుదురు.

శ్లో. అలజ్జతాయే లజ్జన్తే, లజ్జితాయే నలజ్జన్తే
మిథ్యాదృష్టి స్సమాదానాః సత్త్వాగచ్ఛన్తి దుర్గతిమ్ ॥

తా. చేయదగిన మంచిపనులలో లజ్జగలవారై మంచిపనులను చేయనివారును, చేయకూడని చెడ్డపనులలో లజ్జలేనివారును అగు మిథ్యాదృష్టిగలవారు దుర్గతినే పొందెదరు ( బుద్ధుడు ).

## 8. మతి

శ్లో. వైదికేషు తు సర్వేషు, శ్రద్ధాయా సామతిర్భవేత్
గురుణాచోపదిష్టోపి, తంత్ర సంబంధ వర్జితః ॥

తా. వేదశాస్త్ర ధర్మములయందును, గురువాక్యముల యందును గల శ్రద్ధతో కూడిన నిష్ఠ యేది కలదో దానిని 'మతి' యందురు. గురువుచే ఉపదేశింపబడినవైనను క్షుద్రమంత్రాది నిష్ఠలను వదలివేయవలెను.

## 9. జపము

శ్లో. అధీత్య వేదం సూత్రంవా, పురాణం సేతిహాసకమ్
పదేష్వధ్యయనం యశ్చ సదాభ్యాసో జపస్స్మృతః ॥

తా. వేదమునుగాని, బ్రహ్మ ( యోగ ) సూత్రమును గాని, పురాణమునుగాని, భారతము, రామాయణము మొదలగు ఇతిహాసములనుగాని పఠించి అందుగల పదముల యొక్క అర్థతాత్పర్యములను స్మరించుచుండుట యను నిరంతరాభ్యాసము 'జప' మనబడును.

శ్లో. వేదాంత శత రుద్రీయ, ప్రణవాది జపం బుధాః
సత్త్వశుద్ధికరం పుంసాం, స్వాధ్యాయం పరిచక్షతే ॥

తా. ఉపనిషత్తులనుగాని, వేదములలోని కొన్ని భాగములనుగాని, ఓంకారము, గాయత్రి, శివ రామ కృష్ణాది మంత్రజపముగాని మానవుని హృదయమును పరిశుద్ధ మొనర్చును గాన, వానిని పఠించుట, స్మరించుచుండుట 'స్వాధ్యాయము (జపము)' యనబడునని జ్ఞానులు చెప్పిరి.

## 10. వ్రతము

శ్లో. ప్రసన్న గురుణా పూర్వ ముపదిష్టం తనుజ్ఞయా
ధర్మార్థకామ సిద్ధ్యర్థ ముపాయగ్రహణం వ్రతమ్ ॥

తా. ప్రసన్నుడైన గురువు ఉపదేశించిన ధర్మము, ధనము, కామమును సిద్ధింపజేయు నియమములను పాటించుట 'వ్రత'మనబడును. దైవమును, ఆత్మను మరువ కూడదను నియమము కలిగియుండుట నిజమైన వ్రతము.

యమ నియమములు లేని భక్తులు, సాధువులు, సన్యాసులు, వేదాంతులు చెడిపోవుదురు. సంశయము లేదు.

## 11. జ్ఞానగుణములు

శ్లో. అమానిత్వ మదంభిత్వ। మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం। స్థైర్య మాత్మ వినిగ్రహః ॥

శ్లో. ఇంద్రియార్థేషు వైరాగ్య। మనహంకార ఏవచ
జన్మమృత్యుజరావ్యాధి। దుఃఖదోషానుదర్శనమ్ ॥
శ్లో. అసక్తి రనభిష్వంగః। పుత్రదారగృహాదిషు
నిత్యంచ సమచిత్తత్వ। మిష్టానిష్టోపపత్తిషు ॥
శ్లో. మయి చా నన్యయోగేన। భక్తి రవ్యభిచారిణీ
వివిక్తదేశసేవిత్వ। మరతి ర్జన సంసది॥
శ్లో. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం। తత్త్వజ్ఞానార్థ దర్శనమ్
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త। మజ్ఞానం యదతోఽన్యథా॥

(1) అమానిత్వము (2) అసంభిత్వము (3) అహింస (4) క్షాంతి (5) ఆర్జవము (6) ఆచార్యోపాసనము (7) శౌచము (8) స్థైర్యము (9) ఆత్మవినిగ్రహము (10) ఇంద్రియార్థేషు వైరాగ్యము (11) అనహంకారము (12) జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనము (13) అసక్తి (14) పుత్రదారగృహాదిషు అనభిష్వంగము (15) ఇష్టానిష్టములయందు సమభావన ఎల్లప్పుడు నుంచుకొనుట (16) భగవంతునిపై చలించని భక్తి గలిగియుండుట (17) వివిక్తదేశసేవనము (18) జనసంగమునందు ప్రీతి లేకుండుట (19) అధ్యాత్మజ్ఞానమునందు ఎల్లప్పుడు ప్రీతినుంచి సాధన చేయుచుండుట (20) పరమాత్మదర్శనము నొందగోరుటయును 'జ్ఞానగుణము' లనబడును.

## 12. జ్ఞానగుణములే మహాభాగ్యములు

ధనము, గృహములు, భూములు, భార్యాబిడ్డలు, సేవకులు, నగలు, పశువులు, వాహనములు, బంధువులు,

స్నేహితులు, ఆరోగ్యము మొదలగునవి తృప్తికరముగ నుండుటయే 'మహాభాగ్యము' లని అజ్ఞానులు తలంచుచుందురు.

జ్ఞాన గుణము కలిగియుంటయే, మహాభాగ్యమగునని వివేకజ్ఞానులు తలంచుచుందురు.

నిజముగా విచారించినచో భౌతికభాగ్యము లెన్ని యున్నను సత్ప్రవర్తనలు, జ్ఞానగుణములు లేని యెడల జీవితమునకు స్థిరమైన సుఖముండదని తప్పక తెలియును.

## 11. ఇరువది జ్ఞానగుణములు

(వివరణ)

1. అమానిత్వము అనగా, తన్ను తాను పొగడుకొనుట యగును. తన్ను తాను పొగడుకొనుటవలన పుణ్యము నశించును. ఆత్మబలము తగ్గును. లోకులు నిందింతురు. కనుక తెలిసినవారు ఆత్మస్తుతి చేసికొనరు. ఆత్మస్తుతి, పరనిందయును నరకద్వారము లగును.

పూర్వము అపూరు డనువాడు ఇసుకతో కుండలను చేసి, వాటిలో అన్నమువండి సమారాధన చేయుచు దుర్వాసునివద్ద తాను చేసే కార్యమును పొగడుకొనెను. అపుడు దుర్వాసులు "అయ్యా, ఇసుకమీాద ఇట్లు ఆత్మస్తుతి చేసికొనకు" మని చెప్పెను. అందువలన అపూరుడు దుర్వాసుని నిందించెను. వెంటనే ఇసుకకుండలు పగిలి పోయెను.

శ్లో. దానే తపసి కార్యేచ । విజ్ఞానే వినయే నయే
విస్మయోహి నకర్తవ్యో। బహురత్నా వసుంధరా ॥

తా. దాతనని, తపశ్శాలినని, గొప్పగొప్ప కార్యముల జేసితినని, విజ్ఞానవంతుడనని, వినయవంతుడనని, దయాశాలి నని గర్వము నొందరాదు. మనకంటె లోకములో ఎంతెంత గొప్పవారు కలరో ఎవరి కెరుక ?

2. అదంభము అనగా, దంభము లేకుండుట యగును. తన్ను చూచి ఇతరులు మెచ్చుకొనవలెనను ఇచ్ఛతో చేయబడు పను లన్నియును 'దంభ' మనబడును.

శ్లో. ధ్యాన పూజాదికం లోకే। ద్రష్టర్యేవ కరోతియః
పారమార్థిక ధీహీనం। స దంభాచార ముచ్యతే ॥

తా. పరమాత్మయందు భక్తినుంచక 'నేను చేయు చున్న జపము, ధ్యానము, పూజ, సంకీర్తనలు ఇతరులు చూచి మెచ్చుకొనవలెను. నేను చేయు దానధర్మములు ఇతరులు చూచి మెచ్చుకొనవలెను. నా వేష భాషలను చూచి ఇతరులు మెచ్చుకొనవలెను' యను భావములను హృదయములో నుంచుకొని వర్తించువారు 'డంభాచారు' లన బడుదురు.

అత్తరు బుడ్డిపై మూతతీసినచో సువాసన పోవునట్లును, కర్పూరపు డబ్బాపై మూతను తీసివేసినచో క్రమముగా కర్పూరము హరించిపోవునట్లును డంభముతో చేయబడు పుణ్యకర్మల ఫలితములు నశించును.

3. అహింస అనగా, హింసచేయకుండుట యగును. శరీర ములోను, మాటలతోను, మనస్సుతోను మానవాది ప్రాణు

లకు బాధలు కలిగించినవారి జ్ఞానము, భక్తి, వైరాగ్యము, మనశ్శాంతియు నశించును. సద్గుణములు నశించి దుర్గుణములు వృద్ధియగును. హింస చేయువారికి ధైర్యము నశించి, పిరికితనము, సంశయములు, బాధలు వృద్ధియగును.

కోడి పందెములు, గొఱ్ఱెపోతుల పందెములు, ఎడ్ల పందెములు వేయుటయును, కోతులపై గెడ్డలు వేయుటయును వినోదముతో గూడిన హింస యగును.

చంపునేమో! కుట్టునేమో! యను పిరికితనముతో పులులను, పాములను, తేళ్ళను, కందిరీగలను చంపుట భయముతో గూడిన హింస యగును.

కోళ్ళను, మేకలను, పందులను తినుటకు చంపుటయును, చేపలను తినుటకు పట్టుటయును కోరికతో కూడిన హింస యగును.

బలవంతముగా స్వస్త్రీతో గాని, పరస్త్రీతో గాని భోగించుట కామముతో కూడిన హింస యగును.

తిట్టినారని తిట్టుటయును, కొట్టినారని కొట్టుటయును, చంపినారని చంపుటయును, చెప్పినట్లు నడువలేదని బాధ పెట్టుటయును క్రోధముతో కూడిన హింసయగును.

ఇతరులను సన్మార్గమున నడిపించుటకుగాను బాధ గలిగించుట ధర్మసహితహింస యగును.

"అహింసా పరమో ధర్మః । అహింసా పరమం జ్ఞానమ్"

తా. అహింసయే శ్రేష్ఠమైన ధర్మమగును. అహింసయే ఉత్తమమైన జ్ఞాన మనబడును.

కథ : మిక్కిలి ఆకలిబాధతోనున్న ఒక దరిద్రుడు పండ్లుగల వృక్షముపైకి గడ్డలువేసెను. అప్పు డా గడ్డలలో ఒకటి దూరములో కూర్చొనియున్న రాజుగారికి తగిలెను. వెంటనే మంత్రి గడ్డవేసినవానిని వెదకి పట్టుకొని రాజు దగ్గరకు తీసికొనివచ్చి "రాజా, ఈ దుష్టుడే మీపై గడ్డ వేసినాడు. వీనికి మరణశిక్ష విధించమనెదరా?" యనెను. అప్పుడు రాజు "జడమైన, జ్ఞానములేని వృక్షమును గడ్డలతో కొట్టినంత మాత్రమున అది పండ్ల నిచ్చి, వీని యాకలితీర్చెను. కాన, జ్ఞానముగల నన్ను కొట్టినప్పుడు వృక్షముకంటె విశేష ముగా నేను వీనికి ఉపకారము చేయవలెనుగదా! కనుక వీని జీవితపర్యంతమును పోషణకు వలసినంత ధనమును కోశాధికారికి చెప్పి ఇప్పించు"మని మంత్రికి చెప్పెను.

అపకారికి ఉపకారము నెపమెన్నక చేయుట అహింసలో దయ, కరుణయు నగును.

మానవాది జీవులకు బాధకలిగించకుండుట 'అహింస' యగును. బాధలోనుండి వచ్చి ఆశ్రయించినవారికి మేలు చేయుట 'దయ' యగును. బాధపడుచున్న ప్రాణుల జూచి ఉపకారము, సేవచేయుట 'కరుణ' యగును. అహింస కంటె దయ గొప్పది. దయకంటె కరుణ గొప్పది.

క. ధర్మంబె ప్రాణబంధువు
ధర్మమె ఐశ్వర్యకరము ధర్మమె సుఖమున్
ధర్మమె ముక్తికి మార్గము
ధర్మమునకు సాటిలేదు ధర నొకటైనన్ ॥

(4) క్షాంతి అనగా, ఓర్పు, క్షమ, సహనము యనబడును.

"క్షమాతుల్యం తపోనాస్తి క్షమారూపం తపస్వినామ్"

తా. క్షమకు సమమగు తపస్సు లేదు. తపస్సు చేయువారి రూపము క్షమే యగును.

దేవునిపై, ఆత్మపై, ధర్మముపై, నీతిపై ఆధారపడియుండి సుఖదుఃఖములకు, స్తుతినిందలకు, శీతోష్ణములకు, రాగద్వేషములకు, ఆకలిదప్పికలకు, మర్యాద అమర్యాదలకు, కలిమిలేములకు చలించకుండుట 'క్షమ' యనబడును.

హరిశ్చంద్రుడు సత్యమును నమ్మియుండి విశ్వామిత్రుడు పెట్టిన బాధల నన్నిటిని సహించెను.

ప్రహ్లాదుడు శ్రీహరిని నమ్మియుండి తండ్రి పెట్టించిన బాధల నన్నిటిని సహించెను.

ధర్మరాజు ధర్మమును నమ్మియుండి కౌరవులు పెట్టిన బాధల నన్నిటిని సహించెను.

సక్కుబాయి శ్రీ పాండురంగని నమ్మియుండి అత్త పెట్టిన బాధల నన్నిటిని సహించెను.

మీరాబాయి గిరిధరగోపాలకృష్ణుని నమ్మియుండి తల్లిదండ్రులు, మరదియు పెట్టిన బాధల నన్నిటిని సహించి చివరకు శ్రీకృష్ణునిలో ఐక్యమొందెను.

తరిగొండ వేంకమాంబ శ్రీ వేంకటేశ్వరులను నమ్మియుండి తల్లిదండ్రాదులు పెట్టిన బాధల నన్నిటిని సహించెను.

శ్రీ గాంధీమహాత్ముడు సత్యమును, అహింసను యుండి స్వరాజ్యప్రాప్తికొరకు ఆంగ్లప్రభుత్వము కలిగ బాధల నన్నిటిని సహించెను.

శ్రీ అరవిందయోగి, శ్రీ రమణమహర్షి, శ్రీ శివానందస్వామి, శ్రీ మలయాళసద్గురువు, శ్రీ మెహర్ బాబా, శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ వివేకానందస్వామి మొదలగు మహాత్ము లందరును ఓర్పుతో తపస్సుచేసి లోకోద్ధారకులైరి.

ఇతరులు తిట్టినప్పుడు కొట్టలేదుగదా యని ఓర్చుకొనవలెను. కొట్టినప్పుడు అవయవములు చెడగొట్టలేదుగదా యని సహించవలెను. అవయవములు విరుగగొట్టినప్పుడు చంపలేదుగదా యనుకొని ఓర్చుకొనవలెను. చంపినప్పుడు దేహభారమునుండి విడుదలజేసెనుగదా యని సంతోషించవలెను. ఇదియే క్షాంతిగల వారి లక్షణ మగును.

"సత్యపి సామర్థ్యే అపకార సహనం క్షమా"

అడిగే సామర్థ్యము వున్నను అడుగకుండుట, తిట్టే శక్తి యున్నను తిట్టకుండుట, కొట్టే నేర్పరితనము వున్నను కొట్టకుండుట, చంపే పరాక్రమము ( శూరత్వము ) వున్నను చంపకుండుట 'క్షమ' యనబడును.

(5) ఆర్జవము అనగా, నిష్కపటవర్తన యగును. చేసే దొకటి చెప్పే దొకటి, చెప్పే దొకటి చేసే దింకొకటి. హృదయములో వున్న దొకటి, చెప్పేది చేసేది యింకొకటియు గల వర్తనలే 'కపటవర్తనలు' యనబడును. ఇతరులకు

బాధ, నష్టమును కలిగించని కపటవర్తనలవలన పాప దోషములు కలుగవు.

కష్టనష్టములు కలిగించే కపటవర్తనలవలన పాపము కలుగును.

కపటముతో కాలనేమిని తపస్సుచేయుచుండునపుడు హనుమంతుడు చంపెను.

జటాసురుడు బ్రాహ్మణవేషముతో వచ్చి బ్రాహ్మణుడనని చెప్పి పాండవులతో తిరుగుచు ఒకనాడు ద్రౌపదిని తీసికొనిపోవుట భీముడు చూచి చంపెను.

బీజపూరు సుల్తానుచే పంపబడిన అఫ్జుల్ఖాను యుద్ధము మాని సంధిచేసికొనుటకు రావలసినదని కబురుపంపి శివాజీని రప్పించి శివాజీని చంపబోవగా శివాజీ అఫ్జుల్ ఖానును పులిగోళ్ళతో చీల్చి చంపెను.

కొందరు ఇంటిలోను, వీధిలోను నిష్కపటముగా మాట్లాడుచు, వర్తించుచు కష్టనష్టములను తెచ్చుకొనుచున్నారు.

మనకును, ఇతరులకును కష్టనష్టములు కలిగించని కపటవర్తనలు కలిగియుండుట మంచిదే యగును.

రావణాసురుడు కపట సన్న్యాసి వేషముతో వచ్చి సీతను తీసికొనిపోయెను.

అర్జునుడు కపటసన్న్యాసి వేషముతో వచ్చి సుభద్రను తీసికొనిపోయెను. ఇందులో రావణుడు పరభార్యను తీసికొనిపోవుటవలన దోషము నొందెను. అర్జునుడన్నో దోషరహితుడగుటయేగాక, సత్కీర్తివంతు డయ్యెను.

శ్లో॥ ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం, మంత్ర మౌషధ సంగమౌ
దానం మానావమానశ్చ, నవగోప్యా మనీషిభిః ॥

తా॥ 1. జ్యోతిష్కులు, యోగసిద్ధులును "నీవు ఇంత కాలము జీవించెదవు, నీవు ఈవిధముగా మరణించెదవు" యని ఇతరులకు ఆయువును గురించి వెల్లడిచేయకూడదు. 2. గృహములో, మఠములో జరిగిన కలహములను ఇతరులకు చెప్ప కూడదు. 3. గురువు చెప్పిన మంత్రమును తాను గురువు అగునంతవరకును ఇతరులకు తెలియనీయరాదు. 4. రహస్యముగా నుంచదగిన పాముమందు, తేలుమందు మొదలగు మందులను తయారుచేయవలసిన విధములను తెలియజేయ కూడదు. 5. తన కామభోగమును వెల్లడిచేయకూడదు. 6. తానుచేసిన దానధర్మములను వెల్లడిజేసికొనకూడదు. 7. 'నాకు ఇంతఆస్తి కల'దని చెప్పుకొనగూడదు. 8. తన్ను ఇతరులు చేసిన స్తుతిని వెల్లడిచేయరాదు. 9. తన్ను ఇతరులు నిందించిన, అగౌరవించిన విషయమును వెల్లడిజేసికొన కూడదు. మొత్తము తొమ్మిదింటిని రహస్యముగా నుంచ వలెనని పెద్దలు చెప్పిరి.

(6) ఆచార్యోపాసనము అనగా, సద్గురుదేవునకు మనోవాక్కాయములను సమర్పించి సేవచేయుటయు, స్తుతించుటయు, ధ్యానించుటయు నగును. గుర్వాజ్ఞలకు వ్యతిరేకముగా మనోవాక్కాయములను నడిపించుట మహాపాపమగును. పరమాత్మయను పురుషునకును జీవాత్మయను స్త్రీకిని వివాహము చేసి కైవల్యసుఖమనెడి జీవబ్రహ్మైక్యజ్ఞానానందానుభవము గలిగించు వారు 'సద్గురువు'లనబడుదురు.

కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను, మనో బుద్ధులను సద్గురువు చెప్పిన కర్మ, భక్తి, యోగ, జ్ఞాన ధర్మముల ప్రకారము నడిపించుకొనుటయే 'సద్గురుసేవ' యగును. సద్గురుధ్యానముద్వారా కామ, క్రోధ, లోభ, మోహ, గర్వ, అహంకారాది దుర్గుణములను నశింపజేసికొనుచుండువారే నిజమైన శిష్యు లనబడుదురు.

సుఖదుఃఖ, స్తుతినింద, లాభనష్ట, శత్రుమిత్ర, స్త్రీ పురుష, మన్నుబంగారాది భేదము లన్నింటిని సద్గురుధ్యానముతో నశింపజేసికొనినవారే నిజమైన శిష్యు లనబడుదురు.

సర్వమును సద్గురుదేవునివే యని భావించక నావి, నావారు యనువారు గురుద్రోహు లనబడుదురు.

(7) శౌచము అనగా, పరిశుభ్రముగా నుండుట, ఉంచుటయు నగును. శౌచములేనియెడల మనకును, ఇతరులకును బాధలు కలుగును.

శ్లో. మనశ్శౌచం కర్మశౌచం, కులశౌచం చ భారత
శరీరశౌచం వాక్శౌచం, శౌచ పంచవిధం స్మృతమ్ ॥

తా. మనము నివసించే స్థలములను పరిశుభ్రముగా నుంచుకొనవలెను. శరీరమును, వస్త్రమును శుభ్రముగా నుంచుకొనవలెను. పాత్రలను, వస్తువులను శుభ్రముగా నుంచుకొనవలెను. చేయుబడుచున్న పనులుకూడ అందరకును సంతోషము గలిగించునట్లు శుభ్రముగా చేయుబడవలెను. మాటలు కూడ స్వచ్ఛముగా, మితముగా, మృదువుగా ఇతరులకు మేలు గలిగించునవిగా నుండవలెను. మనోబుద్ధులును

చెడు గుణములు, చెడు భావములు ( చెడు ఆలోచనలు ) లేనివై పరిశుభ్రముగా నుండవలెను. పరిశుభ్రముగా యున్న ఇంద్రియములే పుణ్యమును, జ్ఞానమును సంపాదించుకొనుటకు అర్హములై యుండును.

పుణ్యప్రదములైన శబ్దములను వినుట 'కర్ణశౌచ' మగును. పుణ్యప్రదములైన పెద్దలయొక్కయు, దేవతల యొక్కయు పాదములను స్పృశించుట 'చర్మశౌచ' మగును. పుణ్యము, జ్ఞానము గలిగించునట్టి రూపములను ( పుణ్యక్షేత్ర ములను ) దర్శించుట 'దృష్టిశౌచ' మగును. పుణ్యప్రదము లైన ప్రసాదమును స్వీకరించుట 'జిహ్వాశౌచ' మగును. దేవునికి, మహాత్ములకును సమర్పింపబడిన ఫలపుష్పాదులను వాసనచూచుట 'నాసికాశౌచ' మగును.

8. స్థైర్యము అనగా, ఎన్ని కష్టనష్టములు ప్రాప్తించి నను సత్యమును, ధర్మమును, శాంతమును, వైరాగ్యమును, దేవుని, ఆత్మను విడువక స్థిరచిత్తముతో నుండుట.

స్థిరమైన నమ్మకము, అనుభవము లేని భక్తులు, బ్రహ్మచారులు, సన్న్యాసులు, పండితులును భ్రాంతులలో, పాపపు పనులలో, దుర్గుణములలో, భోగములలో పడిపోయి అపకీర్తిని, బాధలను తెచ్చుకొనెదరు.

శ్లో. "అకర్తవ్యం నకర్తవ్యం ప్రాణైః కంఠ గతైరపి"

చేయకూడని పనిని ప్రాణముపోవు పరిస్థితులు ఏర్పడి నప్పటికిని చేయకుండుట 'స్థైర్య' మగును.

లోకమునకు భయపడక దేవునకును, పెద్దలకును, అధర్మమునకును భయపడవలెను.

(9) ఆత్మవినిగ్రహము అనగా, చెడుగుణములలో నున్నమనస్సును మంచిగుణములలో నుంచుట, మంచిగుణములతోనున్న మనస్సును దేవునియందు నిలుపుట, దేవునియందు వున్న మనస్సును స్వాత్మయందు లయింపజేయుటయును యగును.

మనోనిగ్రహము లేనివారు కోతికన్నను, కుక్కకన్నను చంచలముగా, నీచులుగా నుందురు. అన్నిశాస్త్రముల సారము మనోనిగ్రహమే యగును. మనోనిగ్రహము గలవారే దైవసుఖమును, ఆత్మదర్శనమును పొందుదురు.

లోకమును చూచుచున్న మనస్సును, మనస్సును చూచుచున్న పరమాత్మను గుర్తించుటయే 'ఆత్మానాత్మ విచారణ' యగును.

మనస్సే సుఖదుఃఖములను, స్తుతినిందలను, లాభనష్టములను, శత్రుమిత్రులను, స్వర్గనరకములను, దేవతలను, దయ్యములను, బంధమును, మోక్షమును, భార్యాభర్త బంధుమిత్ర పుత్రాదులను సృష్టిచేసికొనుచున్నది. మనస్సు లయించిన నిద్రలోను, సమాధిలోను స్త్రీ పురుషాది భేదములు కనబడుటలేదుగదా! కనుక, మనస్సును స్వాధీనము జేసికొనుచుండుటయే 'ఆత్మవినిగ్రహ'మని గ్రహించవలెను.

(10) ఇంద్రియార్థములయందు వైరాగ్యము అనగా, ఇష్టానిష్ట శబ్దములందు, ప్రియాప్రియ స్పర్శములందు, ఇష్టములైన అయిష్టములైన కనబడు రూపములందు,

ప్రియాప్రియ ఆహారములందు, ఇష్టానిష్టములైన వాసనల యందు ప్రీతి అప్రీతియు లేకుండుట యగును.

"న వైరాగ్యాత్పరం లాభమ్" వైరాగ్యముకంటె లాభకరమైనది, సుఖకరమైనది మరొకటి లేదు.

"వైరాగ్యమేవాఽభయమ్."

వైరాగ్యము గలవారే లోకములో నిర్భయముగా నుండగలుగుదురు.

సర్వము దేవునిదేగాని నాదేమియు లేదు, నా వా రెవ్వరును లేరు యనుకొనుట 'భక్తితో గూడిన వైరాగ్య' మగును.

బ్రహ్మ సత్యము, జగము మిథ్య యనుకొనుట 'జ్ఞానముతో గూడిన వైరాగ్య' మగును.

భార్యాభర్తలు, తండ్రికొడుకులు, తల్లిబిడ్డలు, అన్న దమ్ములు, గురువు శిష్యులు కలహించుకొని సంబంధమును వదలుకొనుట, మమకారమును త్రెంచుకొనుట 'ద్వేషముతో గూడిన వైరాగ్య' మనబడును.

వైరాగ్యము గలవారికే దేవుడు, ఆత్మ, ధర్మమును గుర్తులో నుండును. మనశ్శాంతి, ఆనందానుభవమును కలుగును.

వైరాగ్యము, దైవచింతన గలవారికి అప్రయత్నముగా అన్ని అనుకూలములున్ను చేకూరును. పరమాత్మచింతన లేనివారికి వైరాగ్యము నిలువదు. వైరాగ్యము లేనివారికి పరమాత్మధ్యానము నిలువదు.

(11) అనహంకారము అనగా, అహంకారము లేకుండుట యగును. అహంకార మనగా, దేహముపై గల అభిమాన మగును. అభిమానముగలవారు దేవునికి, పెద్దలకు, రోగులకు నమస్కారము చేయలేరు. సేవ చేయలేరు. సూర్యునకు అర్ఘ్యమిచ్చి నమస్కారములు చేయు లేరు.

అహంకారి అందరికంటె తానే అధికుడనని, తాను చెప్పినట్లు ఇతరులు నడువవలెననియును తలంచును.

శ్లో. తృణా దపి సునీచేన, తరో రివ సహిష్ణు నా
అమానినామాన దేన, కీర్తనీయ స్సదా హరిః ॥

తా. గడ్డిపరకకంటె అల్పుడనని తలంచుచు, వృక్షము వలె ఓర్పుగలవాడై తన్ను తా పొగడుకొనక, ఇతరులను గౌరవించుచు శ్రీహరిని ఎల్లప్పుడును కీర్తించుచుండ వలెను. ఇదియే అనహంకార లక్షణ మగును.

అనహంకారికి మమకారము కూడ దూరమగును.

(12) జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనము అనగా, జన్మించుట దుఃఖమే ననియు, వ్యాధులు వచ్చుట దుఃఖమే ననియు, ముసలితనము దుఃఖమేననియు, మరణము దుఃఖమేననియు తెలిసికొనుట యగును. ఇట్లు తెలిసికొనిన వారికే పాపకర్మల జేయక, నిష్కామపుణ్యకర్మల జేయుచు వైరాగ్యమును పెంపొందించుకొని ఆత్మానాత్మవిచారణతో జపధ్యాననిష్ఠల జేయుచు పునర్జన్మరహితమైన మోక్షము నొందుటకు సదా ప్రయత్నము చేయుచుండవలెననెడి పట్టుదల గలుగును.

శ్రీ బుద్ధుడు రోగిని, ముసలివానిని, శవమును, సన్న్యాసిని చూచి విచారణ చేసికొని మహారాజు కుమారుడయినను తల్లిదండ్రులకును, భార్యకును చెప్పకుండ అర్ధరాత్రి వేళ గృహమును, పట్టణమును వదలి మహారణ్యమునకు పోయి భిక్షమెత్తుకొని భుజించుచు తపస్సుచేసి నిర్వికల్ప నిత్యానందానుభూతి నొందెను.

శ్లో. జరాం మృత్యుం భయం వ్యాధిం, యో జానాతి స పండితః
స్వస్థ స్తిష్ఠే న్నిషీదే ద్వా, స్వపేద్వా కేనచి ద్ధసేత్ ॥

తా. భయములును, వ్యాధులును, ముసలితనమును, మరణమును ప్రతివారికి తప్పక వచ్చుచుండుట చూచుచున్నను, గుర్తులో నుంచుకొని విచారణ అందరును చేయుట లేదు. విచారణచేసి సారమును గ్రహించినవారే పండితులనబడుదురు. నిజ మెరిగి బ్రతుకువారు సుఖముగా తిరుగుదురు. నిద్రించెదరు. మాట్లాడెదరు.

పుణ్యుడు. పావనుడు యను అన్నదమ్ములు తండ్రి యొక్క మరణమును చూచి, వైరాగ్యము గలవారై, ఆత్మ జ్ఞానము నొందిరి.

దేవేంద్రనాథఠాగూరు తల్లియొక్క మరణమును చూచి వైరాగ్యముగలవాడై భగవద్భక్తు డయ్యెను.

విశాఖాదేవి మనుమడు చనిపోయినప్పుడు ఏడ్చుచు, శ్రీ బుద్ధుని బోధను విని, మనశ్శాంతి నొంది జ్ఞానవంతురాలయ్యెను.

మలయాళదేశములో ఒక తెగవారు పుట్టిన బిడ్డలను చూచి ఏడ్చెదరు. చచ్చినవారిని చూచి సంతోషించెదరు.

పుట్టుట బందెఖానాలో పడుట వంటిది. మరణించుట (నిద్రించుట) విడుదల నొందుట వంటిది.

అజ్ఞానులకు పెండ్లిచేసికొనినప్పుడు సంతోషము గలుగునట్లు, జ్ఞానులకు మరణ మనిన సంతోషము గలుగునని శ్రీ మలయాళ సద్గురుస్వాములవారు చెప్పిరి.

(13) అసక్తి అనగా సక్తిలేకుండుట (ఆసక్తి లేకుండుట) యగును.

మానవులకు దేనియందు సక్తి (ప్రీతి) యుండునో అదే విశేషముగా దృష్టిలో నుండును.

తమోగుణమున్నప్పుడు చెడు విషయములు దృష్టిలో నుండును. రజోగుణ మున్నప్పుడు భోగములు దృష్టిలో నుండును. సత్త్వగుణ మున్నప్పుడు దేవుడు, పెద్దలు, ధర్మములు, ఆత్మయును దృష్టిలో నుండును. ఇచట దేవుని స్వరూపమును, సద్గురువును, ధర్మములను దృష్టిలో నుంచుకొనుటయే పదమూడవ జ్ఞానగుణ మగునని తెలియవలెను.

ఒకప్పుడు వశిష్ఠుడు ఒక యజ్ఞము చేయునపుడు అనేకమంది ఋషులు, రాజులును వచ్చిరి. జనకుని చూచి ఋషులు అసూయతో నుండుట వశిష్ఠుడు గుర్తించి తన యోగప్రభావముతో మిథిలానగరాదులు దహన మగుచున్నట్లు చేయగా ఋషులు భయముజెంది తమ కుటీరాదులను కాపాడుకొనుటకు లేచి వెళ్లబోవుచు "ఓ మహారాజా, నీ మిథిలానగరము దహన మగుచున్నది. నీ భార్యలు ఏడ్చుచున్నారు" అని చెప్పిరి. అప్పుడు జనకుడు క్రింది శ్లోకమును చెప్పెను.

శ్లో. అనంతం బత మే విత్తం, యస్య మే నాస్తి కించన
మిథిలాయాం ప్రదీప్తాయాం, న మే దహ్యాతి కించ న ॥

తా. ఓ ఋషులారా, నాకు అంతులేని సంపదలు కలవు గాని వాటిలో నా దొకటియు లేదు. మిథిలానగరము తగులబడిపోవుచున్నను నా దేమియు దహాన మగుట లేదు.

ఈమాటలు ఋషులు విని 'ఆహా, మనకంటె జనక మహారాజే ఆసక్తి రహితుడగు జ్ఞానియగు'నని పలికిరి.

ఆసక్తిగల చోటనే దుఃఖ ముండును. ఎన్నివిషయములపై (ఎన్నివస్తువులపై) ఆసక్తి యుండునో అన్ని బాధలు మానవుల కుండును. ఆసక్తిలేనివానికి దుఃఖమే లేదు. భయమును లేదు.

ఆసక్తిలేని మనస్సే నిశ్చలముగా నుండి దేవుని, ఆత్మను జపించుటకును, ధ్యానించుటకును శక్తిగల దగును.

(14) పుత్ర దార గృహాదుల యందు అనభిష్వంగము అనగా, భార్యా పుత్ర మిత్ర ధన ధాన్య గృహాదుల యందు మమకారము (మోహము) లేకుండుట యగును.

మమకారము గలవారు ధర్మమును, దేవుని మరచి వర్తించి పాపమును, బాధలను పొందెదరు.

యక్షుని చెరువులోని జలమును త్రాగి చనిపోయిన భీమార్జున నకుల సహదేవులను ధర్మరాజు చూచుటకు వచ్చి నప్పుడు యక్షుడు ధర్మరాజుతో "నా ప్రశ్నలకు సమాధానములు చెప్పిన యెడల నీ సోదరులలో నొకనిని బ్రతికించెద" నని నప్పుడు, ధర్మరాజు యక్షుని ప్రశ్నలకు సమాధానములు చెప్పి "నా తల్లికి నేను పెద్దవాడను వున్నాను కనుక నా

పినతల్లి కుమారులలో పెద్దవాడగు నకులుని బ్రతికించు”మని చెప్పెను. అప్పుడు యక్షుడు ధర్మరాజు యొక్క ఉత్తమ ధర్మదృష్టికి సంతసించి అందరిని బ్రతికించెను. ఇచ్చట మమకారము లేకపోవుట వలననే ధర్మమునకు విలువ నిచ్చె నని గ్రహించవలెను.

భారతము అనుశాసనిక పర్వములోని కథ: గౌతమి యను నామె కుమారుని సర్పము కరచి చంపెను. అప్పుడు ఎరుకలవాడు సర్పమును చంపబోవగా గౌతమి అడ్డువచ్చి “నా పిల్లవాడు ఏదో, ఏనాడో పాపముచేసి యుండుటవలన పాము వలన మరణించెను. పాముది తప్పుకాదు. పిల్లవానిదే తప్పు” యనెను. అప్పుడు పాము ‘యముని ఆజ్ఞప్రకారము చంపితి’ ననెను. అప్పుడు యముడువచ్చి ‘నాదేమియు లేదు. లయకర్తయగు శివుని యాజ్ఞ యిది’ అనెను. అప్పుడు శివుడు వచ్చి “నాదేమియు లేదు. పిల్లవాడు చేసికొనినకర్మయే కారణ” మనెను. ఈకథ వలన మమకారములేని గౌతమికి కర్మ యొక్క నిజము తెలిసెనని గ్రహించవలెను.

ద్రౌపదీదేవియొక్క ఐదుగురు కుమారులను నిద్రలో నుండగా అశ్వత్థామ వచ్చి కత్తితో కంఠములను నరికి చంపిన తరువాత ఒకనాడు పాండవులు అశ్వత్థామను చంప యత్నించగా ద్రౌపది చంపవద్దని నివారించెను.

(ఉపపాండవులు పూర్వజన్మమున విశ్వదేవతలు. వీరు ఒకనాడు హరిశ్చంద్రునకు బాధలు కలిగించుచున్న విశ్వామిత్రుని చంప ప్రయత్నించగా విశ్వామిత్రునకు క్రోధము వచ్చినందున “ద్వాపరయుగమున మీరు ఐద

గురును ద్రౌపదికి బిడ్డలుగా బుట్టి అశ్వత్థామచే చంప బడుదురుగాక !" యని శపించెను. )

ఈకథవలన ద్రౌపదియొక్క దయాగుణము, బిడ్డలపై మోహరాహిత్యమును వ్యక్తమైనదిగదా!

కథ : షాజహాను చక్రవర్తియొక్క భార్య తుపాకితో గురిపెట్టి కొట్టుట నేర్చుకొనుచున్న రోజులలో ఒకనాడు దూరములో కనబడకయున్న ఒక పురుషునకు తుపాకిగుండు తగిలెను. అందువలన అతడు చనిపోయెను. అప్పుడు అతని భార్య ఏడ్చుచుండెను. ఈవిషయము చక్రవర్తికి తెలిసినందున వచ్చి "అమ్మా, నా భార్య నీ భర్తను చంపి నిన్ను దుఃఖసాగరములో ముంచెను. కనుక నీవు ఈ కత్తితో నన్ను చంపి నా భార్యను దుఃఖములో ముంచుము" అని చెప్పి ఖడ్గము నిచ్చెను. అప్పుడా తల్లి "మహారాజా, తమరు దేశమునకు తండ్రివంటివారు. మీరు లేకపోయినచో తండ్రి లేని బిడ్డలవలె ప్రజలు చెడిపోవుదురు. నాకు భర్తలేక పోయినను జీవించగల" నని చెప్పి నమస్కారముచేసి రాజుగారి పట్టుదలను నివారించెను.

ఈకథవలన రాజుగారికి భార్యపైకంటె, ధర్మము పైనే విశేషనమ్మిక యున్నట్లు తెలిసినదిగదా!

కథ : మలయాళదేశములో భగవద్భక్తిగల దంపతులు గలరు. వారి కుమారునకు జబ్బుచేసినప్పుడు ఎన్ని మందులు యిప్పించినను తగ్గలేదు. అప్పుడు దంపతులు దేవుని విశేషముగా ప్రార్థనచేయగా "న త్వం శోచితు మర్హసి" అని భగవంతుడు గీతలోని రెండవ అధ్యాయములో ఇరువది

పడవ శ్లోకమును చెప్పెను. దానిని దంపతులు మరల మరల చదువుకొని మననము చేయుచు, మరునాడే కుమారుడు చనిపోయినప్పటికిన్ని దుఃఖపడక, భగవద్వాక్యముపై పూర్ణవిశ్వాస ముంచుకొని శాంతిగా నుండిరి.

జనకమహారాజుకూడ గృహాదులపై మమకారము నుంచుకొనక శాశ్వతమైన పరమాత్మయందే దృష్టి నుంచుకొని వర్తించెను.

పై జెప్పబడిన కథలవలన "అనభిష్వంగః పుత్రదారగృహాదిషు" అను పదునాలుగవ జ్ఞానగుణముయొక్క వివరణ తెలిసినదిగదా!

గ్రుడ్డివారికి రూపముల నిజము తెలియని చందమున, మమకారముగలవారికి మంచి చెడ్డలు, నిత్యానిత్యములున్ను తెలియబడవు.

(15) "నిత్యం చ సమచిత్తత్వం ఇష్టానిష్టోపపత్తిషు" అనగా, ఇష్టములైనవి వచ్చినను, ఇష్టముకానివి లభించినను వారి వారి కర్మానుసారముగా వచ్చుచు పోవుచుండునని నిశ్చయించుకొని ఓర్పుతోను, దైవచింతనతోను చలించక యుండుట యగును.

"సిద్ధ్య సిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥"

తా. సుఖదుఃఖములు, లాభనష్టాదులు గలిగినను దేవునిపైని, ధర్మముపైని దృష్టినుంచుకొని సమదృష్టితో నుండుట 'యోగ' మనబడును.

ధర్మరాజు ధర్మముపై పూర్ణవిశ్వాసము నుంచుకొని యిష్టానిష్టములను సమముగ చూచెను.

అక్బరు చక్రవర్తికి కుమారుడు పుట్టిన రోజుననే తల్లి మరణించెను. అందువలన సంతోషమును, దుఃఖమును పొందక సమముగా నుండెను. ఇట్లే మనమున్ను దైవాత్మ స్మరణ ధ్యానములతోను, ధర్మప్రవర్తనలతోను కష్టసుఖ ములను దృష్టిలో నుంచుకొనక యుండవలెను.

పగలు తరువాత రాత్రి, రాత్రి తరువాత పగలును వచ్చుచు పోవుచునుండునట్లు కష్టము సుఖము, లాభము నష్టము, స్తుతి నింద, కలిమి లేమి, ఆరోగ్యము అనారోగ్యము, పుట్టుక చావు వచ్చుచు పోవుచుండును. కాన వీనిని లెక్కలో నుంచుకొనక దైవచింతనమును, వైరాగ్యమును, దయా రసగుణమును లెక్కలోనుంచుకొని యుండుట 'సమచిత్తత' యనబడును. సమచిత్తులు సర్వదా సంతోషముగా నుందురు.

(16) "మయి చానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ" అనగా, ఇతర భయభ్రాంతులులేని నిశ్చలభక్తితో భగవంతుని మరువక యుండుట యగును. దైవరుచి తెలిసిన వారికి ఇతరభ్రాంతు లుండవు. సర్వమును సృష్టించునదియు, పోషించునదియు, చంపునదియు భగవంతుడే అయినప్పటికి మానవులలో ననేకులు దురహంకారముతో "నేను పుట్టించితిని, నేను పోషించితిని, నేను చంపితిని" యని తలంచుచు గర్వము జెందుచున్నారు. సర్వమునకును భగవంతుడే కర్తయగు ననెడి నిశ్చయము గలవారికే అనన్య భక్తికుదురును. అనన్యభక్తి అమృతము వంటిది. ఇట్టి భక్తి గలవారిలో తప్పువర్తన లుండవు. పిచ్చిభ్రాంతు లుండవు.

పార్వతీదేవి శివునియొక్క అర్ధశరీరములో నివసించని రోజులలో అనేక తప్పులు చేసినది. ఇట్లే మనము కూడ భగవంతుని పూర్ణముగా నమ్మనంతవరకును దుర్గుణములతో నుందుము. చెడువర్తనలతో నుందుము.

అనన్యభక్తులను భగవంతుడు సర్వదా కాపాడుచు నుండును.

"ఓ భగవంతుడా, మంచి చెడ్డలు నాకు వద్దు. ధర్మాధర్మములు నాకు వద్దు. భోగభాగ్యములు నాకు వద్దు. కీర్తిప్రతిష్ఠలు నాకు వద్దు. శుచి అశుచిలు నాకు వద్దు. జ్ఞానాజ్ఞానములు నాకు వద్దు. బంధ మోక్షములు నాకు వద్దు. నీయందలి అనన్యభక్తి నొక్కదానిని మాత్రమే నాకు యిమ్ము" యని భక్తులు భగవంతుని కోరవలెను.

"అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా."

తా. ఇతర మానవులను, ధనాది వస్తువులను ఆశ్రయించి యుండక, భగవంతు నొక్కనినే ఆశ్రయించి యుండుట 'అనన్యభక్తి' యనబడును.

ఒకప్పుడు నామదేవుడు, హఠయోగియు యాత్ర చేయుచుండగా ఒకనాడు మైదానప్రదేశమున మిక్కిలి దాహముతో నుండి నీటికై వెదకసాగిరి. అప్పుడొకచోట మిగుల లోతైన బావిలో అడుగున కొంచెము నీరు వుండుట గాంచిరి. అప్పుడు హఠయోగి ఒకపక్షియై ఎగిరి లోతునకు పోయి వ్రాలి తృప్తికరముగా నీరు త్రాగి బైటకు ఎగిరి వచ్చి మరల మానవాకారమును ధరించెను. నామదేవుడు పాండురంగభక్తుడగుటచేత పండరీక్షేత్రమువైపునకు తిరిగి

పాండురంగనికి నమస్కరించి ప్రార్థన చేయగా బావిలోని నీరు పైకి పొంగివచ్చి ప్రవహించెను. అప్పుడు నామదేవుడు దాహము తీర్చుకొని స్నానము కూడా చేసెను. ఈ దృశ్యమును చూచుచున్న హఠయోగి అత్యాశ్చర్యమగ్నుడై తాను కూడా భక్తిమార్గము నవలంబించెను. ఈకథవలన 'భగవంతుని నమ్మినవారికి కొరత లేమియు నుండ'వని తెలియుచున్నదిగదా!

## పురందరదాసు, అతని భార్య

పురందరదాసు వజ్రాల వ్యాపారస్థుడు. కోటీశ్వరుడు. పరమలోభి కూడ. ఇతనిని ఒక హరిదాసు తన కుమారుని ఉపనయనానికి సహాయము చేయవలసినదని ఆరుమాసములు తిరుగుచు అడుగుచుండగా చివరికి పురందరదాసు ఒక చెల్లని రూపాయి నిచ్చెను. దానిని హరిదాసు, పురందరదాసు భార్య దగ్గరకు తీసికొనిపోయి "ఆరుమాసములు తిరుగగా ఒక లోభి వర్తకుడు ఇచ్చె"నని చెప్పెను.

"నీకేమి కావలె"నని పురందరదాసు భార్య అడిగెను.

"నాకు ధనము కావలె"నని హరిదాసు చెప్పెను.

ఆమె: నా దగ్గర ధనము లేదే!

హరిదాసు: ఇవ్వాలనివుంటే లేకపోలా! వజ్రముతో పొదిగిన నీ ముక్కుపుడక యిస్తే నా కార్యం నెరవేరుతుంది. నీకు యివ్వడానికి ఇష్టంలేకపోతే వెళ్లిపోతాను.

ఆమె : కాదు కాదు. అతిథి స్వయముగా విష్ణువు. నీవు కోరింది యివ్వకుండా పంపలేను అని ముక్కుపుడకను ఊడదీసి యివ్వబోవగా

హరిదాసు : నీ భర్తకు తెలిస్తే వూరుకుంటాడా ?

ఆమె : భయంలేదు. నా ప్రాణమునైనా నీకు అర్పించుటకు సిద్ధముగా వున్నాను అని 'కృష్ణార్పణ'మంటూ ముక్కుపుడకను హరిదాసుకు అర్పించింది.

హరిదాసు సరాసరి పురందరదాసు కొట్టునకు వెళ్ళెను. ఇతనిని చూడగానే పురందరదాసు క్రోధముతో 'సిగ్గులేకుండా మళ్లీ వచ్చావా ? ' అన్నాడు.

హరిదాసు : నేను యిప్పుడు యాచనకు రాలేదు. ఈ ముక్కుపుడక తీసికొని నాకు డబ్బు ఇమ్ము. ఇందుకే వచ్చినాను.

పురందరదాసు ఆ ముక్కుపుడకను పరీక్షించి చూచి, ఇది తన భార్యదేనని గుర్తించి, ' ఇది ఎక్కడిది ?' అని గద్దించి అడిగెను.

హరిదాసు : (నెమ్మదిగా) ఒక పుణ్యాత్మురాలు కానుకగా సమర్పించినదని చెప్పెను.

పురందరదాసు : ఓ దొంగా, బహుమతిగా పొందినది నిజమేనా ?

హరిదాసు : దొంగనా ! శ్రీకృష్ణుడు దొంగా ?

పురందరదాసు : కృష్ణుడు దొంగైతే నీవును దొంగవేనా ? నీవు, కృష్ణుడూ ఒకటా ! రేపురా, నీ కథ కనుక్కుంటాను.

హరిదాసు వెళ్లిపోయినాడు. పురందరదాసు మండి పడుతూ సరాసరి ఇంటికి వెళ్లి తలుపులు తట్టినాడు. అతని భార్య చప్పుడు విని మరొక భక్తుడు భిక్షకై వచ్చినాడని భావించి 'గోపాలదాసయ్యా!' అని పిలిచింది.

పురందరదాసు: ఆ, గోపాలదాసయ్యే! ఒక చెంప పెట్టుతో గోపాలుడు కనబడును, తలుపులు తీయి. (భార్య తలుపులు తెరచింది.)

భర్త: ఆ అడుక్కునే దాసరికి ఏమి యిచ్చావు?

భార్య: భిక్ష పెట్టితిని.

భర్త: ఏమి భిక్ష పెట్టితివి?

భార్య: పిడికెడు బియ్యం పెట్టితిని.

భర్త: అవును, వజ్రాలపుడకను పిడికెడు బియ్యంగా యిచ్చివేసితివి. ఏదీ నీ పుడక?

భార్య: పూజాగృహములో దాచితిని.

భర్త: ఈక్షణంలో తెచ్చి చూపు.

భార్య పూజాగృహములోగల శ్రీకృష్ణభగవానుని విగ్రహము ఎదుట నిలబడి కన్నీటితో, "కృష్ణా! తండ్రీ, ఆపద్బాంధవా! ఈ యాపదనుండి రక్షించుము. నీవు రక్షించకపోతే ఆత్మహత్య తప్పదు, నీవే దిక్కు" అని అనన్య భక్తిభావముతో ప్రార్థించగా, వజ్రాలపుడక విగ్రహము యొక్క పాదాల దగ్గర తళతళ మెరుస్తూ కనబడినది. ఆమె సంతోషముతో ఆ పుడకను భర్తకు యిచ్చినది.

భర్త: ఓహో, దుకాణపు పెట్టెలో దాచి వచ్చితిని గదా! ఇది ఇక్కడికి ఎట్లు వచ్చినది అనుకొని దుకాణము

నకు వెళ్లి పెట్టెతెరచి చూడగా పుడక భద్రముగానే వున్నది. అతడు భగవన్మాయను తలంచుకుంటూ పూర్తిగా మారిపోయి నాడు. చీకటి వెలుతురుగా మారినట్లు అయింది. ఆరు మాసములు ద్వేషించుచున్న హరిదాసును దృష్టిలోనుంచు కొని 'ఓ హరిదాసా, నిన్ను మరల చూడాలి. నిన్ను చూడ కుండ ఒక్కక్షణం బ్రతకలేను. రా, నాదగ్గరకు' అని ప్రార్థించ గానే శ్రీకృష్ణభగవానుడు ప్రత్యక్షమయ్యెను. అప్పుడే పురందరదాసు సర్వసంపదలను బీదలకు దానముచేసి, భార్యతో కలసి విజయనగరములోని విజయ విఠోభా దేవా లయములోని స్వామిని సేవించుకొనుచు నుండిరి.

ఈకథవలన అనన్యభక్తి ప్రభావము తెలిసినదిగదా!

జీవితము ఏకాలమున, ఏవిధముగా మార్పులు చెందునో దేవునికి తెలియునేగాని మనకు తెలియదు. కావున నిష్కామముతో భగవంతుని సదా ధ్యానించుచుండవలెను.

(17) వివిక్తదేశసేవిత్వము అనగా, దైవచింతనకు, నీతిధర్మవర్తనలకు, వైరాగ్య సుఖమునకును ప్రతిబంధకము గలుగని స్థలమున నివసించుట యగును.

మహాత్ములు, పరమభక్తులు కూడ మొదట చెడు రూపములు కనబడని స్థలములలో, చెడు శబ్దములు వినబడని చోట్లలో నివసించి జపము, ధ్యానము, పూజ, స్మరణ, విచారణలను చేసి, ఇంద్రియములను జయించి, దైవాత్మ సాక్షాత్కారజ్ఞానము నొందిరి. కాన మనమున్ను మహాత్ముల బాటనే నడుచుకొనుచుండవలెను.

దోషమైన స్థలములలో నివసించి అనేకులు చెడిపోవు చున్నారు.

(18) అరతిర్జనసంసది అనగా, జనసంఘముతో నుండవలెనను ప్రీతిలేకుండుట యగును.

భగవంతునితోనే సదా స్నేహము గలిగియుండుట గొప్పది. భగవంతుడు సర్వత్ర నిండియుండుటవలన, సర్వమును భగవత్స్వరూపమే యని భావించుచుండుటయే భగవంతునితో స్నేహముచేయుట యగును.

ఎప్పుడైనను మంచివారితో స్నేహము చేయవచ్చును గాని, చెడ్డవారితో మాత్రము స్నేహము చేయకూడదు.

అందరును, అన్నివస్తువులును భగవత్స్వరూపములే యని భావించవచ్చునే గాని అందరితోను, అన్నివస్తువుల తోను సంబంధము గలిగియుండ కూడదు.

మనస్సునకు శాంతి, శరీరమునకు ఆరోగ్యమును గలిగించు విషయములతోనే సాధనపరులు సంబంధము పెట్టుకొని యుండవలెను.

పాపములేని పనులు, పాపములేని మాటలు, పాపము లేని సంకల్పములు జీవితమును పావన మొనర్చునను విషయమును సదా గుర్తులో నుంచుకొని సాధకులు మెలగ వలెను.

(19) అధ్యాత్మజ్ఞాన నిత్యత్వము అనగా, ఆత్మస్వరూప జ్ఞానము నొందుటకు ఎల్లప్పుడును పాటుపడుచుండుట యగును.

ఆత్మజ్ఞానసుఖముయొక్క విలువ తెలిసినవారు మాత్రమే రాత్రింబవళ్ళును ఇతర కోరికలను విడిచి ఆత్మ

నాత్మ, బంధమోక్ష విచారణ జపధ్యానములను చేయుచు నుందురు.

వేదాంతులలో, భక్తులలో ననేకులు దైవాత్మచింతనకు విలువ నివ్వక అల్ప స్వల్పములైన సుఖములకు, ధనాది వస్తువులకు, కీర్తిప్రతిష్ఠలకు దాసులై భ్రష్టు లగుచున్నారు.

కథ : ఒకడు జ్ఞానము నొందుటకుగాను తపస్సుచేయుచుండగా ఒకనాడు పరమేశ్వరుడు ప్రత్యక్షమై "నీకేమి కావా"లని అడిగెను. అప్పుడు ఆ తపశ్శాలి "నాకెప్పుడును దరిద్రము, కష్టాలను అనుగ్రహించు"మని కోరెను. వెంటనే శివుడు "ఇదేమి! ఎన్నో గొప్ప సుఖములు, భోగము లుండగా బాధాకరములైన వాటిని కోరితివేల?" అనెను. అందుకు ఆ భక్తుడు "ఈ సంపదలుంటే నాచెవులు వినవు. నాకండ్లు చూడవు. నాచేతులు తాకవు. సంపద లున్నయెడల సంసార బంధములోపడి, జననమరణాలలో క్రింద మీద పడక తప్పదు గదా! దరిద్రము, కష్టములు వుండిన మాత్రమే నిన్నెప్పుడును జ్ఞాపకము చేసికొనుచు వుందును. ఇదే మహాభాగ్యము. నిన్ను మరచిన జీవితము వ్యర్థ మగును" అనెను.

ఈకథవలన జ్ఞానసంపాదనయందు విశేషశ్రద్ధయుండవలెనని తెలియుచున్నదిగదా!

కథ: శ్రీ మలయాళస్వాములవారు తిరుపతి కొండపై గల గోగర్భ (పాండవ) గుహలో తపస్సు చేయుచున్న కాలములో ఒకరు వచ్చి "స్వామీ, మీరు భగవంతుడు ప్రత్యక్షము కావలెననిగాని, ఏమైన చెప్పవలెననిగాని, వరము లియ్యవలెననిగాని, కోరికతో తపస్సు చేయుచున్నారా?

యని అడిగెను. అందుకు స్వామి "నేను భగవంతుడు ప్రత్యక్షము కావలెనని తపస్సు చేయుటలేదు. వరముల కొరకున్ను తపస్సు చేయుటలేదు. వరములన్నియు అనిత్యము లైనవేగదా! భగవంతుడు భగవద్గీతలో మోక్షధర్మముల నన్నిటిని చెప్పియున్నాడుగాన, భగవంతుడు నాకు ఏవైన ధర్మములను చెప్పవలెనను కోరికతో తపస్సు చేయుటలేదు. ఋషివర్యు లందరును ఏ సనాతన పరబ్రహ్మము (స్వరూపము) యొక్క అనుభూతి నొందగోరి స్వరూపమును ఆచ్ఛాదించినట్టి ఆవరణ దోషనివారణ కొరకును, లోకకల్యాణము కొరకును తపస్సు చేసినారో, అట్టి ఆత్మకల్యాణ, లోకకల్యాణముల కొరకు నేను తపస్సు చేయుచున్నా" ననిరి.

ఈకథవలన కూడ అధ్యాత్మజ్ఞానము కొరకు నిత్యమును పాటుపడవలెనని తెలియుచున్నదిగదా!

(20) తత్త్వజ్ఞానార్థదర్శనము అనగా, ఆత్మసాక్షాత్కార జ్ఞానము నొందవలెననెడి తీవ్రమైన ఆవేదన యుండుట యగును.

చదువును పూర్తిజేసికొనిన విద్యార్థి ఉద్యోగములో చేరవలెనను ఇచ్ఛతో నుండునట్లును, ఆకలి బాధతోనున్నవారు వంట పూర్తియైన తరువాత భోజనము చేయవలెనను తొందరతో నుండు నట్లును, దేవుని చూచుటకై దూరప్రదేశమునుండి వచ్చిన యాత్రికుడు దేవుని దర్శనము చేసికొనవలెననెడి తీవ్ర భక్తితో నుండునట్లును—పై జెప్పబడిన పందొమ్మిది జ్ఞానసాధన ధర్మములను సంపాదించుకొనిన ముముక్షువులు, పరమ

భక్తులు, వైరాగ్యవంతులు ఆత్మదర్శనము నొంద వలెనని సదా నిరీక్షించుచుండవలెను. ఇది ఇరువదవ జ్ఞాన గుణ మనబడును.

" ఏతత్ జ్ఞాన మితి ప్రోక్తం, అజ్ఞానం యదతోఽన్యథా "

పై జెప్పబడిన ఇరువదియు 'జ్ఞాన (ఆత్మ) సాధన గుణము' లనబడును. వీనికి వ్యతిరిక్తములైన గుణములు 'అజ్ఞాన గుణము' లనబడును.

యజ్ఞము, పూజ, వ్రతము, తీర్థయాత్ర, ఉపవాసము, నమస్కారములు, సేవ, దానధర్మములు, భజనలు, జపము, పారాయణలు మొదలగు సత్కర్మలు హృదయములో గల దుర్గుణములు తగ్గుటకు ఏర్పడినవి.

అమానిత్వాది ఇరువది జ్ఞానగుణములన్నో మనస్సు నిశ్చల మగుటకు ఏర్పడినవి.

మనస్సు, నామ రూప ప్రపంచ విషయముల మీదకు పోవుట మాననిదే మనస్సును తెలిసికొనుచున్న సాక్షిని (ఆత్మను) పొందుటకు సాధ్యపడదు.

మనస్సు (జీవుడు) ఆధారచక్రము, స్వాధిష్ఠాన చక్రము, మణిపూర్వకచక్రము, అనాహతచక్రము, విశుద్ధ చక్రము, ఆగ్నేయ చక్రము లందు తిరుగుచున్నంత వరకును నిశ్చలముగా నుండదు, నశించదు. సహస్రారచక్రమగు ఆత్మ యందు చేరియున్నప్పుడే మనస్సు పూర్తిగా స్వాధీన మగును.

ప్రతిదినమును తొమ్మిది గంటలు జపము, ధ్యానము, ఆత్మానాత్మవిచారణలు చాలా దినములు చేయగా చేయగా మనస్సు నిశ్చల మగును. ఆత్మజ్ఞానము కలుగును.

శాస్త్రముల సారము, తపస్సుల ఫలితము నేమనగా మనస్సు నిశ్చల మగుటయు, స్వాత్మదర్శన మగుటయు నగును.

ఆత్మకును, జగమునకును మధ్యలో మనస్సు కలదు. మనస్సును బహిర్ముఖము జేసికొనినప్పుడు లోకము, సంసారము, దేహము కనబడును. మనస్సును అంతర్ముఖ మగునట్లు చేసినప్పుడు స్వాత్మ (పరబ్రహ్మము) అనుభవ మగును. ఇదే కైవల్య మోక్షము.

అమానిత్వాది జ్ఞానగుణములు సత్త్వగుణముతో నున్నవారికే అలవడును. సత్త్వగుణమును కూడ దాటనిదే పరబ్రహ్మానుభవము కలుగదు.

నిర్గుణ నిరాకార పరబ్రహ్మమును నిరంతరమును ధ్యానము చేయుచుండిన మాత్రమే సత్త్వరజస్తమో గుణములను స్వాధీనము చేసికొనుటకును, దాటుటకును సమర్థులగుదురు.

## 12. జ్ఞేయస్వరూపము

శ్లో. జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి। యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ। న సత్తన్నాసదుచ్యతే ॥

శ్లో. సర్వతః పాణిపాదం త। త్సర్వతోఽక్షి శిరోముఖం
సర్వత శ్శ్రుతిమల్లోకే। సర్వమావృత్య తిష్ఠతి ॥

శ్లో. సర్వేంద్రియ గుణాభాసం। సర్వేంద్రియ వివర్జితం
అసక్తం సర్వభృచ్చైవ। నిర్గుణం గుణభోక్తృచ ॥

శ్లో. బహి రంత శ్చ భూతానా।మచరం చర మేవ చ
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం। దూరస్థం చాన్తికే చ తత్॥
శ్లో. అవిభక్తం చ భూతేషు। విభక్త మివ చ స్థితం
భూతభర్తృ చ తద్జ్ఞేయం। గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥
శ్లో. జ్యోతిషా మపి త జ్జ్యోతిః। తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం। హృది సర్వస్య విష్ఠితమ్॥

ఎప్పటికైనను మానవుడు స్వస్వరూపమగు పరబ్రహ్మానుభవము నొందవలెను. అప్పుడే అక్షయ సుఖము నొంది జనన మరణములతో నున్న దుఃఖము నశించును. పరబ్రహ్మము అసత్యములైన పంచమహాభూతములకు, సత్యమైన ప్రకృతికి (సత్త్వ రజ స్తమో గుణములకు) విలక్షణమైనది.

పరబ్రహ్మము అన్నివైపుల చేతులు గలది. అన్ని చోట్ల దేవునకు పాదములు గలవు. అన్ని స్థలములలోను నేత్రములు, శిరములు, ముఖములు, చెవులు గలిగి సర్వత్ర భగవంతుడు నిండి యున్నాడు. కనుక, ఎవ్వరు లే రనుభావముతో తప్పులు చేయకూడదు. భయపడ కూడదు. అంతటను భగవంతుడు కలడు యను విశ్వాసముతో నున్న భక్తులు, జ్ఞానులు కోరిక, క్రోధము, భయము, సుఖము, దుఃఖమును లేనివారై ఎల్లప్పుడును బ్రహ్మానందముతో నుందురు.

పరబ్రహ్మము ఇంద్రియము లన్నిటికిని తెలిసికొనే తెలివి నిచ్చుచున్నది. పరమాత్మకు ఇంద్రియము లేమియు

లేవు. దేనికిని అంటదు. సర్వమును భరించును. గుణములు లేనిది, గుణములను అనుభవించునదియు నగును.

ఆ పరమాత్మ లోపల వెలుపలను, సమస్త చరాచరములలోను నిండియున్నది. పరమాత్మ సూక్ష్మముగా నుండుటవలన ఇంద్రియములకు కనబడదు. జ్ఞానులకు పరమాత్మ దగ్గరనే కలదు. అజ్ఞానులకు మాత్రము దూరములో నున్నట్లు తోచును.

అనేకములుగా కనబడుచున్న ప్రాణులలో పరమాత్మ ఏకముగానే యున్నది. పుట్టించుట, పోషించుట, చంపుట యును పరమాత్మయొక్క పని యగును.

ఆ పరబ్రహ్మము సూర్యునకు, చంద్రునకు, అగ్నికి ప్రకాశమిచ్చుచున్నది. చీకటిని, వెలుగును కూడ పరమాత్మ తెలిసికొనుచున్నది. అమానిత్వాది ఇరువది జ్ఞానగుణములు గలవారే ధ్యాన సమాధుల ద్వారా పరబ్రహ్మానుభవము నొంద గలరు. అన్నిప్రాణులలోను పరమాత్మ కలదు.

పరమాత్మకంటె అన్యముగా జీవుడు లేడు. జీవునికంటె వేరుగా మనస్సు లేదు. మనస్సుకంటె వేరుగా జగము (సంసారము) లేదు యని యోగవాసిష్ఠము చెప్పెను.

(1) పరిపూర్ణజ్ఞానులును, పరమభక్తులును పరమాత్మకన్యముగా దేనిని చూడరు. కనుక వీరు 'పూర్ణవికసితచేతను' లనబడుదురు.

(2) సాధకులు అప్పుడప్పుడు భగవన్నామస్మరణ, జప ధ్యానముల ద్వారా పరమాత్మసుఖమును రుచి చూచెదరు. కాన వీరు 'వికసితచేతను' లనబడుదురు.

(3) సామాన్య మానవులు ఎల్లప్పుడును ఇంద్రియ విషయములతో నుందురు. కనుక వీరు 'ముకుళితచేతను' లనబడుదురు.

(4) పశుపక్ష్యాదులు ఆహార నిద్ర భయ మైధునముల లోనే జీవించుచుండును. కనుక ఇవి 'సంకుచితచేతనము' లనబడును.

(5) రాళ్లలోను, చెట్లలోను పరమాత్మ వున్నప్పటికిన్ని చలనము కనబడుటలేదు గనుక అచరములు 'ఆచ్ఛాదిత చేతనము' లనబడును.

రాళ్లలో పరమాత్మ నిద్రించుచున్నదనియు, చెట్లలో పరమాత్మ శ్వాస విడుచుచున్నదనియు. పశుపక్ష్యాది క్రిమి కీటకములలో పరమాత్మ తిరుగుచున్నదనియు, మానవులలో పరమాత్మ జ్ఞానముతోనున్నదనియు కొందరు పెద్దలు చెప్పిరి.

నేను, నాది యను భావములను పోగొట్టుటకుగాను సద్గురువులును, శాస్త్రములును 'జగము మిథ్య'యని చెప్పిరి. ఇట్లే సంసారము అనిత్యమైనదని, దేహేంద్రియాదులు నీవు కావనియు, అఖండ పరబ్రహ్మమే నీ వనియును బోధించిరి.

నిజము చెప్పవలెనంటె జగము, సంసారము, దేహేంద్రియాదులు పరబ్రహ్మముకంటె అన్యముగా లేవు, సర్వము పరబ్రహ్మమే.

బ్రహ్మజ్ఞాని ముఖమునందు అంతములేని పరబ్రహ్మా నంద జ్యోతియే ప్రకాశించుచుండునేగాని కోరిక, క్రోధము, ఆశ, మమకారము, భయము, అసూయ, ద్వేషము, గర్వము, అహంకారము, సుఖ దుఃఖములును కనుపించవు.

అమానిత్వాది జ్ఞానగుణములు గల సాధకులారా, నామ రూప క్రియలను వర్ణించక, దేశకాలములను పరికించక సర్వమును పరబ్రహ్మమే యను అనుభవమును సుస్థిర మొనర్చుకొనుటయే 'పరబ్రహ్మ సాక్షాత్కార జ్ఞాన' మగునని గ్రహించుకొనుడు.

ఆంజనేయుడు సూర్యునివద్ద ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదములను అభ్యసించెను. మరియు, (1) తర్కశాస్త్రము (2) వ్యాకరణశాస్త్రము (అనగా, పాణినీయము, కలాపము, సుపద్మము, సారస్వతము, ప్రాతిశాఖ్యము, అనగా కుమారవ్యాకరణము, ఇంద్రము, వ్యాఘ్రభౌతికము, శాకటాయనము, శాకల్యము యను నవవ్యాకరణములను) (3) ధర్మశాస్త్రమును (4) మీమాంసశాస్త్రమును (5) వైద్యశాస్త్రమును (6) జ్యోతిషశాస్త్రమును యను ఆరు శాస్త్రములను అభ్యసించెను.

ఇట్టి హనుమంతుడు కూడ శ్రీరామునితో

శ్లో. దేహ బుద్ధ్యా తు దాసోహం, జీవ బుద్ధ్యాత్త్వ దంశకః
ఆత్మ బుద్ధ్యా త్త్వమేవాహం, ఇతి మే నిశ్చితా మతిః ॥

తా. ఓ రామా, దేహదృష్టితో నీకు నేను దాసుడను. జీవదృష్టితో నీయొక్క అంశమే నేను. ఆత్మదృష్టితో నీవే నేనయి యున్నాను అనెను.

ప్రతిమానవునిలోను మలము (పాపము), విక్షేపము (చంచలము), ఆవరణము (ఆత్మను కప్పిపుచ్చిన తెర) అను మూడు దోషము లున్నవి. ఆ మూడు దోషములు

నశించనంతవరకును దుఃఖములు నశించవు. శాశ్వతా నందము లభించదు.

దాసబుద్ధితో నిష్కామముగా పుణ్యకార్యములను చేసినవారు మల (పాప) దోషములను నశింపజేసికొందురు. జీవబుద్ధితో నిష్కామముగా భగవంతుని ధ్యానించుచు, జపించుచు, భజించుచు నున్నవారు విక్షేపము (మనశ్చాంచల్యము) నుండి విడుదల నొందుదురు. మనోబుద్ధులకు సాక్షిగా నున్న పరమాత్మయే నేను యనుచు ధ్యానము చేయుచుండు వారు ఆవరణదోషమును పోగొట్టుకొని పరబ్రహ్మసాక్షాత్కారజ్ఞానము నొందుదురు.

(1) మలము (పాపము) గలవారికి మోక్షమార్గమును తెలిసికొనవలె ననెడి ప్రీతి కలుగదు. సద్గ్రంథములను చదువవలె ననియును, సజ్జనసాంగత్యము చేయవలె ననియును, సుక్షేత్రములను దర్శించవలె ననియును, సత్కార్మల గావించవలె ననియును నిశ్చయ మేర్పడదు.

(2) విక్షేప (మనశ్చాంచల్య) దోషము గలవారు దేవునిపై దృష్టి నిలిపి పారాయణ, ప్రార్థన, పూజ, ధ్యానము, జపములను చేయ జాలరు.

కామ, క్రోధ, ఆశ, గర్వ, అహంకార, సుఖదుఃఖాది వికారగుణములను నిగ్రహించలేరు.

(3) ఆవరణదోషముగలవారు మనోబుద్ధులను, జాగ్రదావస్థను, స్వప్నావస్థను, నిద్రావస్థను తెలిసికొనుచున్న పరమాత్మయే నేను యని ధ్యానము చేయలేరు. అన్ని

భూతములలోను, అన్నిచోట్ల, అన్నిదిక్కులందును నిండి యున్న పరిపూర్ణపరబ్రహ్మమును గాంచలేరు.

పండితులలో, వేదాంతులలో, సాధు సన్న్యాసులలో ననేకులు మల, విక్షేప, ఆవరణ దోషములను నశింపజేసి కొనక, నిర్గుణ నిరాకార పరబ్రహ్మ విషయములను చెప్పుకొనుచు, బోధించుచు కాలమును వ్యర్థముగా గడుపుచు, ఇహపరసుఖములకును దూర మగుచున్నారు.

జ్ఞానగుణములను సమకూర్చుకొనకుండ జ్ఞానగమ్య మగు జ్ఞేయ బ్రహ్మానుభూతియందు నిలువ జాలరు.

నామ రూప క్రియలు దృష్టిలో నున్నంతవరకు నామ రూపాది భేదములులేని స్వాత్మానందానుభవము నిలువదు.

మానవుని మొదటిరూపము శరీరము యగును. రెండవ రూపము సంకల్పముల కుప్పయే స్వరూపముగా యున్న జీవు డగును. మూడవరూపము సర్వసాక్షిచైతన్య మగు పరమాత్మ యగును.

తమోగుణస్థులు శరీరమే నేను యను బుద్ధితో రాత్రింబవళ్లును శరీర సుఖము కొరకే పాటుపడుచు సుఖ దుఃఖముల నొందుదురు.

రజోగుణస్థులు గుణములతోనున్న జీవుడే తా మనుకొనుచు శాంతముగనున్న మనస్సుతో సంతోషించుచు, అశాంతిగనున్న మనస్సుతో (ఉద్రేకములతో) బాధలుపడుచు రాత్రింబవళ్లును మనశ్శాంతికై పాటుపడుచు నుందురు.

సత్త్వగుణస్థులు సుఖదుఃఖసంకల్పగుణము లేని పరబ్రహ్మానందమే తా మని నిశ్చయించుకొని రాత్రింబవళ్లును నిర్వికల్ప సుఖము నొందుటకు పాటుపడుచుందురు.

ఎన్నిజన్మలకైనను జీవులకు నిర్వికల్ప సమాధి యొక్క అభ్యాసముద్వారా స్వాత్మ సాక్షాత్కారజ్ఞానము కలుగ వలసియే యున్నది.

చూచుచున్నది నిత్యమైనది. కనబడుచున్నవి అనిత్యము లైనవి. లోకము, శరీరము, సంసారము, మనోవృత్తులు, గుణములు, నిద్రయును కనబడుచున్నవి. ఆత్మ వాటి నన్నిటిని చూచుచున్నది, తెలిసికొనుచున్నది.

లోకములో కనబడుచున్నవాటిని ఆశ్రయించినవారే అజ్ఞానులు, దుఃఖితులు యనబడుదురు. చూచుచున్న ఆత్మను నమ్మియున్నవారే జ్ఞానులు, ముక్తులు, సుఖవంతులు యనబడుదురు.

# 13. ఇంద్రియములు : వాని నిగ్రహము

## కర్మేంద్రియములు : వాని క్రియలు

శ్లో. వాక్పాణి పాద పాయూపస్థాః, కర్మేంద్రియ పంచకమ్
భాషణా దాన గమన విసర్గానందకాః క్రియా ॥

తా. (1) వాక్కు—మాట్లాడునది (2) చేతులు—పనులు జేయునవి (3) పాదములు—నడచునవి (4) పాయువు—మలవిసర్జన చేయునది (5) ఉపస్థ—మూత్రమును, శుక్ల శోణితములను విసర్జించునది—ఇవే కర్మేంద్రియములు.

## జ్ఞానేంద్రియములు : వానిక్రియలు

శ్లో. చక్షుశ్శ్రోత్రే ఘ్రాణ జిహ్వాత్వక్చ దీంద్రియ పంచకమ్
రూప శబ్దా గంధరసౌ స్పర్శశ్చ విషయాః క్రమాత్ ॥

తా. (1) నేత్రములు—రూపములను చూచును (2) చెవులు—శబ్దములను వినును (3) ముక్కు—వాసనలను తెలిసికొనును (4) జిహ్వ—రుచులను తెలిసికొనును (5) చర్మము—శీతోష్ణాదులను తెలిసికొనును—యివే జ్ఞానేంద్రియములు.

## మనస్సు

శ్లో. గతేవ కలంసకత్వం, కదాచి త్కల్పనాత్మకమ్
ఉన్మేషరూపిణీ నానా, తథైవ హి మనస్సతా ॥

తా. శుద్ధచైతన్యము ఎప్పుడు అవిద్యచేత మలినము నొందినట్లు కనబడుచున్నదై, స్ఫురణరూపము గలిగి, వికల్పములచేత అనేకరూపముల జెందునో, అప్పుడు అది 'మన' స్సనబడును.

## బుద్ధి

శ్లో. భావనా మనుసంధానం, యదా నిశ్చిత్య సంస్థితా
తదైషా ప్రోచ్యతే బుద్ధి, రియత్తా గ్రహణ క్షమా ॥

తా. గడచిన నామ రూప క్రియల గురించియు, గడవ బోవు విషయముల గురించియు, గడచుచున్న విషయముల గురించియు నిశ్చయించుచు విశేషరూపమును గ్రహింప సమర్థత ఎప్పుడు గలుగునో అప్పు డది 'బుద్ధి' యనబడును.

## చిత్తము

శ్లో. ఇదం త్యక్త్వేద మాయాతి, బాలవ త్త్వేలవా యదా
విచారం సంపరిత్యజ్య, తదా సా చిత్త ముచ్యతే॥

తా. మంచి చెడు, సత్యాసత్యములను విచారణ చేయక ఒకవిషయమును వదలి ఇంకొక దానిని బాలునివలె స్మరించునప్పుడు 'చిత్త' మనబడును.

## అహంకారము

శ్లో. యదా మిథ్యాభిమానేన, సత్తాం కల్పయతి స్వయం
అహంకారాభిమానేన, ప్రోచ్యతే భవబంధనీ॥

తా. నశించిపోవునట్టి దేహమే తా ననెడి అభిమానము గలిగి, సత్యమైన ఆత్మను మరచి, సంసార బంధన రూపమైన దేహాత్మదృష్టితో అహంకరించునప్పుడు 'అహంకార' మనబడును.

శ్లో. ఇంద్రియ స్యేంద్రియస్యార్థే, రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్న వశ మాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ॥

తా. ప్రతి ఇంద్రియ విషయమునందును రాగము (యిష్టము), ద్వేషము (అయిష్టత) గలవు. కనుక మోక్షసుఖము నొంద దలంచువారు ఆ రాగద్వేషములకు వశపడ కూడదు. రాగమును, ద్వేషమును జ్ఞానమార్గమున నడచు వారికి శత్రువు లగును.

అభ్యాసకులకు పుణ్యము, జ్ఞానమును గలిగించునట్టి మంచివిషయములపై రాగ ముండవలెను. పాపము, అజ్ఞానమును పెంచునట్టి చెడువిషయములపై ద్వేష ముండవలెను.

శ్లో. అతత్వజ్ఞ మవిశ్రాంత మలబ్ధాత్మా నమ స్థితి
నిగిరం తీంద్రియాణ్యాశు హరిణా ఇవ పల్లవమ్॥

తా. లేళ్లు, దుప్పులు, కుందేళ్లు చిగురుటాకులను తినునట్లు ఆత్మతత్త్వస్వరూపము నెరుగనివాడును, మన శ్శాంతి నొందనివాడును, ఆత్మయందు నిలకడ నొందని మనస్సుగలవాడును అగు మానవుని ఇంద్రియములు భక్షించుచున్నవి.

శ్లో. యస్యాజ్ఞానాత్మనోజ్ఞస్య, దేహ ఏవాత్మభావనా
ఉదితే తిరుష్టైవాక్ష, రిపవోభి భవంతి తమ్॥

తా. సత్యమైన ఆత్మను మరచి, అనిత్యమైన దేహామే తాననుకొని ఇంద్రియములను వశములో నుంచుకొనని అజ్ఞానిని, ఇంద్రియము లనెడి శత్రువులు అధికక్రోధముతో ఎదిర్చి బాధించెదరు.

శ్లో. యస్య జ్ఞానాత్మనోజ్ఞస్య సత్యేవాత్మని సంస్థితిః
సంతుష్ట్యైవాక్ష సుహృదో నఘ్నంతి తమ నిందితమ్॥

తా. ఏ మానవుడు సత్యస్వరూపాత్మయందు నిలకడ బొందిన జ్ఞానముగలవాడో, ఆ మానవుని ఇంద్రియములు మిత్రునివలె సంతోషముతో నాదరించును. అయ్యవి వాని నేమియు బాధింపవు, అనుకూలముగా వర్తించి జ్ఞానమును వృద్ధిజేయును.

శ్లో. ఇంద్రియ గ్రామ సంగ్రామ, సేతునా భవసాగరః
తీర్యతే నేతరే ణేహా, కేన చిన్నామ కర్మణా॥

తా. ఇంద్రియనిగ్రహ మనెడి సేతువుచే (వంతెనచే) సంసారసాగరమును దాటవచ్చును. ఇంతకు మించిన సులభ మార్గము లేదు. కేవలము కర్మలచేత దాటలేరు.

శ్లో. ఇంద్రియాణాం తు సర్వేషాం, యద్యేకం క్షరతీంద్రియమ్
తేనా నక్షరతి ప్రజ్ఞాధృతేః, పాత్రాది వోదకమ్ ॥

తా. ఇంద్రియములలో నేదేని యొక్క ఇంద్రియ మైనను స్వాధీనము కాక విషయములలో సంచరించుచున్నచో ఓటికుండలోని నీరువలె ప్రజ్ఞ (జ్ఞానము) తరిగిపోవును.

శ్లో. జితేంద్రియ మనుష్యస్య, సిద్ధిః ప్రాప్నోతి నిశ్చితమ్
నైవా జితేంద్రియస్యైవ వేదవాద రతస్య చ ॥

తా. ఇంద్రియములను జయించిన మానవునకు తప్పక మోక్ష (జ్ఞాన) సిద్ధి గలుగును. వేదశాస్త్రములను బాగుగా చదివిన మహాపండితులకైనను ఇంద్రియములను స్వాధీనపరచు కొననిచో ఆత్మజ్ఞానము సిద్ధించదు. (హఠయోగప్రదీపిక)

శ్లో. ఇంద్రియోత్తమ రోగాణాం, భోగాశావర్జనాదృతే
నౌషధాని న తీర్థాని, న మంత్రాశ్చ శాంతయే ॥

తా. ఇంద్రియముల చాంచల్యమనెడి రోగము భోగములపై గల ఆశలను వదలితే తప్ప ఔషధములచేతను, తీర్థయాత్రలచేతను, మంత్ర జపములచేతను శాంతి నొందదు.

శ్లో. బలేన పరరాష్ట్రాణి, గృహ్ణాన్ శూరస్తునోఽన్యతే
జితోయేనేంద్రియగ్రామః సశూరః కథ్యతే బుధైః ॥

తా. బలముచేత పరరాజులను జయించి, దేశములను స్వాధీనము చేసుకొనినంత మాత్రమున నిజమైన శూరుడన బడడు. తనలోగల మానసాదీంద్రియములను జయించి స్వాధీనమునందుంచుకొని నడిపించుకొనువాడే నిజమైన 'శూరు' డన బడును.

శ్లో. ఇంద్రియాణి తు సంయమ్య, బకవత్ పండితో నరః
దేశకాల బలం జ్ఞాత్వా, సర్వకార్యాణి సాధయేత్ ॥

తా. వివేకజ్ఞానముగల మానవుడు కొంగవలె ఇంద్రియములను స్వాధీనమందుంచుకొని దేశధర్మమును, కాలధర్మమును, తనబలమును తెలిసికొనియుండి జాగ్రత్తగా తాను చేయ తలంచిన పనులను చేయుచుండవలెను. నిజమును గుర్తించక ప్రారంభించిన పనులవలన పాపము, అపకీర్తి బాధలు కలుగును.

శ్లో. శ్రుత్వా స్పృష్ట్వాచదృష్ట్వాచ, భుక్త్వా ఘ్రాత్వాచ యో నరః
న హృష్యతి న చ, గ్లాతి స విజ్ఞేయో జితేంద్రియః ॥

తా. ఏమానవుడు చెవులతో మంచి చెడు శబ్దములను వినుచున్నను, చర్మముతో శీతోష్ణాదులను తాకుచున్నను, నేత్రములతో మంచి చెడు రూపములను చూచుచున్నను, నాలుకతో రుచి అరుచులను తినుచున్నను, ముక్కుతో సువాసన దుర్వాసనలను చూచుచున్నను, సుఖమును, బాధను పొందడో, ఆ మానవుడే ఇంద్రియములను జయించిన 'మహానుభావు' డనబడును.

శ్లో. యస్మాన్మంత్రబలోపేతః, క్రీడ న్సర్పైర్నదృశ్యతే
క్రీడ న్నపి నలిప్యేత, తద్వదింద్రియ పన్నగైః ॥

తా. గారుడ మంత్రము గలవాడు సర్పములతో ఆట లాడుచున్నను సర్పములచే కరవబడడు. ఇట్లే బ్రహ్మజ్ఞానానుభవమనెడి మంత్రముగల మహాత్ముడు, ఇంద్రియము లనెడి సర్పములతోనున్నను, వానిచే ఎన్నడును బాధ నొందడు.

## 14. మోక్షాధికారు లెవరు?

శ్లో. శాంతో దాంతః క్షమీ శూరః, సర్వేంద్రియ శమాన్వితః
అసక్తో బ్రహ్మజ్ఞానేచ్ఛుః, సదా సాధు సమాగమః॥

శ్లో. సాధుబుద్ధి స్సదాచారీ, అభేద స్సర్వదైవతే
ఆశాపాశ వినిర్ముక్తో, హ్యేతే మోక్షాధికారిణః॥

తా. (1) కామ క్రోధ భయాది గుణములులేని ప్రశాంతమనస్సుకలవాడును (2) చేతులు, పాదము, వాక్కు మొదలగు బాహ్యేంద్రియములను అదుపులో నుంచుకొను వాడును (3) సుఖ దుఃఖ స్తుతి నింద శీతోష్ణాది ద్వంద్వములు కలిగినపుడు చలించక ఓర్చుకొనువాడును (4) నీతి నిష్ఠలను తప్పకుండా కాపాడుకొను విషయములో శూరత్వముగల వాడును (5) సర్వేంద్రియములను నిశ్చలముగా నుంచుకొనిన వాడును (6) దేనియందును ప్రీతిలేనివాడును (7) పరబ్రహ్మ సాక్షాత్కారానుభవమునందే దృష్టిగలవాడును (8) సజ్జను లతోనే సాంగత్యము చేయుచుండువాడును (9) ఉత్తమబుద్ధి గలవాడును (10) మంచి నడవడిగలవాడును (11) శివరామ కృష్ణాది దేవతలయందును, శంకరాచార్య రామానుజ

మధ్వాచార్యాది మహాత్ములయందును సమదృష్టిగలవాడును (12) కోరికల (ఆశల) నన్నిటిని వదలివేసినవాడును అగు పుణ్యాత్ముడే మోక్షాధికారి యనబడును.

శ్లో. వివేకినో విరక్తస్య, శమాది గుణశాలినః
ముముక్షో రేవహి బ్రహ్మజిజ్ఞాసా యోగ్యతామతా ॥

తా. నిత్యానిత్యవస్తు వివేకజ్ఞానముగలవాడును, వైరాగ్యం, అంతరేంద్రియ, బాహ్యేంద్రియ నిగ్రహము ఉపరతి, తితిక్ష, సమాధానము గలవాడును, బంధవిముక్తి (పుణ్య పాపముల నుండి, సుఖదుఃఖముల నుండి, రాగ ద్వేషములనుండి, జనన మరణముల నుండి విడుదల) నొందవలెనని తీవ్రేచ్ఛగలవాడును అగు పరిశుద్ధహృదయుడే పరబ్రహ్మమును గురించి చింతన ధ్యానముల జేయుటకును, పరబ్రహ్మానుభవము నొందుటకును అధికారి యనబడును.

శ్లో. దేహే నశ్వరతా బుద్ధేః, వైరాగ్యాద్విషయేషు చ
ఏతాభ్యామేవ లింగాభ్యాం, జ్ఞేయా స్వస్యాధికారితా ॥

తా. ఈ దేహము అనిత్యమైనదనెడి దృఢ నిశ్చయమును, ఇంద్రియ విషయభోగములయందు విరక్తియు నగు ఈ రెండు గుర్తులును గలవాడే ఆత్మసుఖము నొందుటకు అధికారి యగునని తెలియవలెను. (రమణగీత)

శ్లో. తపోభిః క్షీణపాపానాం, శాంతానాం వీతరాగిణాం
ముముక్షూణా మపేక్ష్యోయ, మాత్మబోధో విధీయతే ॥

తా. శారీరక తపస్సు, వాచిక తపస్సు మానసిక తపసుల జేసి పాప దోషములను పోగొట్టుకొన్నవారును,

ప్రశాంతమైన (క్రోధరహితమైన) మనస్సుగలవారును, కోరికలను విడిచినవారును, తీవ్ర ముముక్షుత్వము (మోక్షకాంక్ష) కలవారును అగు సజ్జనులకే ఆత్మజ్ఞాన తత్వము చెప్పబడినది.
(ఆత్మబోధము)

శ్లో. ఇదంతే నాతపస్కాయ, నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం, నచమాంయోఽభ్యసూయతి॥

తా. తపస్సుచేయనివానికి, భగవంతుడనగు నాయందు భక్తిలేనివానికి ఈ భగవద్గీతను ఒకప్పుడుకూడ చెప్పకూడదు. నాకు సేవచేయనివానికిని, నాయందు అసూయగలవానికిని (అనగా నన్ను ద్వేషించుచుండువానికిని) గీతాజ్ఞానధర్మములను చెప్పకూడదు. (గీత. అ. 18)

తపస్సు, భక్తి, సేవచేయు స్వభావము, భగవస్తుతియు గలవారే గీతాధర్మములను వినుటకు, చదువుటకు, అనుష్ఠించి అనుభమునకు తెచ్చుకొనుటకు అధికారులనబడుదురని భావము.

శ్లో. జ్ఞానం వివేకిన మిహోపదిశంతి తజ్జ్ఞా
నో బాల ముద్భ్రమ మసన్మయ మార్యముక్తం
అజ్ఞం ప్రశాస్తి కిలయః కనకావదాతాం
సస్వప్నదృష్ట పురుషాయ సుతాం దదాతి॥ (జ్ఞానవాసిష్ఠం)

తా. సద్గురువులు వివేకవంతులగు అధికారులకే బ్రహ్మజ్ఞానమును బోధించెదరు. కాని బాలుడును, భ్రాంతులతో కూడినవాడును, పెద్దలచేత త్యజింపబడినవాడును అగు మూర్ఖునికి బోధింపరు. ఎవరైతే యిట్టి మూర్ఖునికి బోధించు

చున్నారో వారు స్వప్నమున కనబడిన పురుషునకు బంగారపు నగలతో అలంకరింపబడిన కన్యను దానము చేయుచున్నారు. (ఇది వ్యర్థక్రియయేగదా!)

శ్లో. క్రియావంతః శ్రోత్రియాయే, సగుణబ్రహ్మచింతకాః
తేషా మేవ బ్రహ్మతత్త్వ విద్యా మేతాం వదేద్బుధః ॥

తా. సద్గురువులు శాస్త్రవేత్తలు, సత్కర్మనిష్ఠులును అయినవారై సగుణబ్రహ్మమును ఎవరు సేవించుచున్నారో వారికే నిర్గుణబ్రహ్మతత్త్వమును బోధించవలెను. (సగుణోపాసనద్వారా హృదయమును శుద్ధ మొనర్చుకొనినవాడే నిర్గుణోపాసన చేయుటకు అధికారి యగును.)

శ్లో. సాకారం భజతావత్త్వం, యావత్సత్వం ప్రసీదతి
నిరాకారే పరే తత్త్వే తతః స్థితి రకృత్రిమా ॥

తా. ఎంతవరకు హృదయము (మనస్సు) శుద్ధము నొందుచుండునో అంతవరకును సాకారమును సేవించుచుండుము. అందువలన నిరాకారమగు పరతత్త్వమునందు సహజసిద్ధమగు నిలకడ కలుగుచున్నది. (జ్ఞానవాసిష్ఠము)

శ్లో. అశిష్యాయాఽవిరక్తాయా, యత్కించి దుపదిశ్యతే
తత్స్యాత్య పవిత్రత్వం, గోక్షీరం శ్వదృతావివ ॥

తా. గురువుయెడ భక్తి విశ్వాస వినయ విధేయతలనబడు శిష్యలక్షణములు లేనివానికిని, విషయభోగములపై వైరాగ్యము లేనివానికిని కొంచెముగా జ్ఞానధర్మములను బోధించినప్పటికిని, అవి, కుక్క చర్మపు సంచిలో పవిత్రమైన కపిలగోవుయొక్క పాలను పోసినచో ఎట్లు అపవిత్రమగునో అట్లే అపవిత్రమగును.

శ్లో. నాఽవిరక్తాయ సంసారా, న్నాఽనిరస్తేషణాయ చ
న చాఽస్య యతయే దేయం, వేదాంతార్థ ప్రవేశనమ్ ॥

తా. సంసారమునుండి విరక్తుడుగాని వానికిని, భార్య పుత్ర ధనములపై వైరాగ్యముగలుగని వానికిని సన్న్యాస వేషముగలవాడైనప్పటికిని గురువు వేదాంతమును చెప్పరాదు.

# 15. సాధన చతుష్టయ సంపత్తి

## 1. నిత్యానిత్యవస్తు వివేకము

శ్లో. నిత్య మాత్మస్వరూపం హి, దృశ్యం త ద్విపరీతగమ్
ఏవం యో నిశ్చయ స్సమ్య గ్వివేకో వస్తునస్సవై ॥

తా. ఆత్మయే నిత్యమైనదనియు, ఆత్మ కన్యమైన దేహాది నామ రూప ప్రపంచము అనిత్యమైనదనియు బాగుగా నిశ్చయించుకొనుట యేది గలదో అదియే 'నిత్యానిత్యవస్తు వివేకము (విచారణ)' యనబడును.

## 2. ఇహాముత్ర ఫలభోగ విరాగము

శ్లో. బ్రహ్మాది స్థాం వరా స్తేషు, వైరాగ్యం విషయేష్వను
యథైవ కాకవిష్ఠాయాం, వైరాగ్యం తద్ధి నిర్మలమ్ ॥

తా. కాకి మలమునందు మనకు ప్రీతిలేని విధముగా బ్రహ్మదిలోకముల యందుగల భోగవిషయములయందు విరక్తి గలిగియుండుటయే 'నిర్మలవైరాగ్య' మనబడును.

## 3. శమము

"స దైవవాసనాత్యాగః శమోఽయ మితి శబ్దితః"

తా. ఎల్లప్పుడును విషయవాసనలను త్యజించివేయుటయే 'శమము' యనబడును.

## 4. దమము

"నిగ్రహో బాహ్యవృత్తీనాం దమ ఇ త్యభిధీయతే"

తా. బాహ్యములగు కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ వృత్తులను నిగ్రహించుటయే 'దమ' మగును.

## 5. ఉపరతి

"విషయేభ్యః పరావృత్తిః పరమోపరతిర్హిసా"

తా. ఇంద్రియ విషయ సంకల్పములు శ్రవణము, మననము, ధ్యానము చేయుచున్నప్పుడు పుట్టకుండుట శ్రేష్ఠమైన 'ఉపరతి' యగును. (సన్న్యాసమే ఉపరతి)

## తితీక్ష

"సహనం సర్వ దుఃఖానాం తితిక్షా సా శుభామతా"

తా. వచ్చిన దుఃఖముల నన్నిటిని (ధర్మదృష్టితో గాని, దైవదృష్టితోగాని) సహించుట 'తితీక్ష' యగును.

## శ్రద్ధ

"నిగమాచార్య వాక్యేషు భక్తిః శ్రద్ధేతి విశ్రుతా"

తా. వేదశాస్త్రధర్మ[illegible]ను, సద్గురువుల దివ్య సందేశముల యందును గల విశ్వాసమే 'శ్రద్ధ' యనబడును.

## సమాధానము

"చిత్తైకాగ్ర్యం తు సల్లక్ష్యే సమాధాన మితి స్మృతమ్"

తా. పరమాత్మయందు మనస్సు ఏకాగ్రత గలిగి యుండుట 'సమాధాన' మనబడును.

## ముముక్షుత్వము

శ్లో. సంసారబంధ నిర్ముక్తిః, కథంస్యాన్మేకదావిధే
ఇతి యా సుదృఢాబుద్ధిః, వక్తవ్యా సా ముముక్షుతా ॥

తా. ఈ సంసార బంధము (దుఃఖము) ఎప్పుడు నాకు వదలి పోవునో యని మిక్కిలి దృఢమైన బుద్ధికలుగుట 'ముముక్షుత్వ' మనబడును.

శ్లో. రాగ ద్వేష విహీనోయః, శమాది గుణసంయుతః
హరిధ్యానపరో నిత్యం, ముముక్షు రభిధీయతే ॥

తా. రాగద్వేషములు లేనివాడును, శమ దమాది సద్గుణములు గలవాడును, ఎల్లప్పుడును శ్రీహరి ధ్యానమును చేయుచుండువాడును 'ముముక్షువు' యని చెప్పబడును.

# 16. ఆత్మజ్ఞానవిచారణ యన నేది ?

శ్లో. కోహం కథ మిదంజాతం। కోవా కర్తాఽస్య విద్యతే
ఉపాదానం కి మస్తీహ। విచారః సోయ మీదృశః ॥
(శంకరులు)

తా. "నే నెవడను? ఈ జగమెట్లు పుట్టినది? ఈ లోకమునకు కర్త యెవడు? ఈ ప్రపంచమునకు ఉపాదాన మేది?" అని యిట్లు తర్కించుకొనుటయే (ప్రశ్నల వేసికొనుట) 'విచారణ' యగును.

శ్లో. కి మిదంస్యాత్ జగత్కింస్యా దహమిత్యనిశంశనై
విచార యాఖ్యాత్మదృశా, స్వయంవా సజ్జనైస్సహ ॥

తా. "ఈ జగమన నేది? నే నెవడను?" అని మెల్లగ స్వయముగాగాని, సజ్జనులతో కలిసిగాని సూక్ష్మమైన జ్ఞాన దృష్టితో (బుద్ధితో) విచారించుము. (జ్ఞాన వాసిష్ఠము)

శ్లో. గచ్ఛత స్తిష్ఠతోవాపి। జాగ్రత స్స్వపతోఽపివా
నవిచారపరంచేతో। యస్యా సౌ మృతఏవసః ॥

తా. నడచుచున్నను, నిలచియున్నను, మేల్కొని యున్నను ఎవని చిత్తము ఆత్మజ్ఞాన విచారణయందు ఆసక్తి గలది కానేరదో, అట్టివాడు మరణించిన వానితో సమానుడని తలంచవలయును.

శ్లో. తిష్ఠన్ గచ్ఛన్ స్వపన్, జాగ్రన్నిఃశ్వ సన్నుత్పతన్ పతన్
అసదేవేదమిత్యంత ర్నిశ్చిత్యాస్థాం పరిత్యజ ॥

తా. నిలచుచు, నడచుచు, నిద్రించుచు, మేల్కొనుచు, నిట్టూర్పు విడుచుచు, ఎగురుచు, పడుచు పనిచేయుచున్నను ఈ సంసారము (జగం) అసత్యమైనదని హృదయములో నిశ్చయించి, దానియందు ఆసక్తిని విడువుము (ఉంచకుము).

శ్లో. శాస్త్ర సజ్జన సంపర్కై-ర్వైరాగ్యాభ్యాసపూర్వకమ్
సదాచార ప్రవృత్త్యాయా ప్రోచ్యతే సా విచారణా ॥

తా. భగవద్గీతాదిశాస్త్రములను చదువుచు, సజ్జనులతో సాంగత్యముచేయుచు, ఈ దేహము, ధనము, పుత్రమిత్రాదులును అనిత్యములైనవేయని వైరాగ్యముతో చింతించుచు కర్మేంద్రియ జ్ఞానేంద్రియ మనోబుద్ధులయొక్క స్వేచ్ఛా ప్రచారములను అభ్యాసముద్వారా నిగ్రహించుచు చక్కని ధర్మజ్ఞాన సద్గుణములతో ప్రవర్తించుచుండుట 'విచారణ' యనబడును.

శ్లో. నాహం భూతగణో దేహో, నాహం చాక్షగణ స్తథా
ఏత ద్విలక్షణః కశ్చి ద్విచారః సోయ మీదృశః ॥
( శంకరులు )

తా. నేను పంచభూతములు కాను. దేహమును నేను కాను. ఇంద్రియములు నేను కాను. వీటి నన్నింటిని ప్రకాశింపజేయుచు విలక్షణముగా యున్న ఆత్మచైతన్యమే నేను యని తలంచుచుండుట 'విచారణ' యగును.

శ్లో. అజ్ఞానాత్ ప్రభవం సర్వం జ్ఞానేనప్రవిలీయతే
సంకల్పో వివిధఃకర్తా, విచారః సోయ మీదృశః ॥

తా. ఈ మాయాభ్రాంతులు, సంకల్పము లన్నియును విచారణజ్ఞానము (ఆత్మజ్ఞానము) లేకపోవుటచేత (అజ్ఞానమునుండి) కలుగుచున్నవి. మరల జ్ఞానము కలుగగానే (ఆత్మవిచారణ ధ్యానములు చేయగానే) నశించుచున్నవి. అన్నిపనులకును మనోసంకల్పములే కారణము లగును అని ఈ విధముగా నిజతత్త్వమును చింతించుచుండుట 'విచారణ' యగును.

శ్లో. ఏతయోర్యదుపాదాన। మేకం సూక్ష్మం స దవ్యయమ్
యథావా మృద్ఘటాదీనాం। విచార స్సోయ మీదృశః ॥

తా. కుండలు, బొమ్మలు మొదలగువాటికి మన్ను ఉపాదానకారణమైనట్లు ఈ దేహాది జగముల సృష్టి స్థితి లయములకు ఉపాదానకారణము పరమాత్మయే యని తెలిసికొని యుండుట 'విచారణ' యగును. పరమాత్మ స్వరూపము అద్వైతము, సూక్ష్మము, నాశరహితము నగును.

శ్లో. అహమేకోఽపి సూక్ష్మశ్చ। జ్ఞాతా సాక్షీసదవ్యయః
త దహం నాత్రసందేహః। విచార స్సోయ మీదృశః ॥

తా. నేను ఏకస్వరూపుడను, సూక్ష్మముగా యున్నాను. ఇంద్రియము లన్నిటిని తెలిసికొను చున్నాను. సమస్తము నకును సాక్షిగా నున్నాను. శాశ్వత స్వరూపుడను, కనుక నిస్సందేహముగా పరబ్రహ్మమే నేను అని చింతించుచుండుట 'ఆత్మవిచారణ' యనబడును.

"సర్వక్లేశ నివృత్తిస్స్యాత్, ఫల మాత్మవిచారతః"

తా. సమస్త దుఃఖములును నశించుటయే ఆత్మ విచారణకు ఫలమగును. ( ఆత్మవిచారణ చేసిన మాత్రమే దుఃఖములు నశించును )

శ్లో. విచారః సఫల స్తస్య। విజ్ఞేయో యస్య సన్మతే
దినానుదిన మాయాతి। తానవంభోగగృధ్నుతా ॥

తా. ఏ సాధకునియొక్క విషయభోగముల ఇచ్ఛ దినదినమును క్షీణించుచుండునో అట్టివానిచే చేయబడు విచారణయే సఫల మగును. అనగా, విషయభోగములపై

గల ఇచ్ఛ నశించుచుండిన మాత్రమే నిజముగా ఆత్మవిచారణ చేసినట్లగును. ఇంద్రియ విషయ సుఖములపై (స్త్రీ, ధన కీర్తి ప్రతిష్ఠలపై) ఆసక్తిగల వేదాంతులు, సన్న్యాసులు నిజమైన ఆత్మవిచారణ చేయలేదనియే గ్రహించవలెను.

శ్లో. అవిచార్యైవ వేదాంతం। మోక్షం యః ప్రాప్తు మిచ్ఛతి
సపిధాయాక్షిణీ భానుం। కర్ణాభ్యాం ద్రష్టు మిచ్ఛతి॥

తా. వేదాంత (ఆత్మ) విచారణ చేయక మోక్ష సుఖమును పొందగోరు వారు కన్నులు మూసికొని, చెవులతో సూర్యుని చూడదలంచు మానవులవంటివా రగుదురు.

శ్లో. తరపో పిహి జీవంతి। జీవంతి మృగ పక్షిణః
సజీవతి మనోయస్య। మననే నోపజీవతి॥

తా. వృక్షములు జీవించుచున్నవి. మృగములు, పక్షులును జీవించుచున్నవి. ఎవడు పరమాత్మ విచారణ చేయుచుండునో వాడే జీవించినవాడగును. ఆత్మచింతన చేయనివాడు బ్రతికియున్నను చచ్చినవానితో సమ మన బడును.

# 17. జ్ఞాన మనగా నేమి?

శ్లో. బ్రహ్మైవాహం సమశ్శాంతః। సచ్చిదానందలక్షణః
నాహం దేహోహ్యసద్రూపో। జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

తా. నేను చలనము లేనివాడను. శాంతస్వరూపు డను. సత్యము, జ్ఞానము, ఆనందము లే స్వరూపములుగా గల వాడను. అశాశ్వతమైన ఈ దేహము నేనుగాను అనెడి

నిశ్చయానుభవమే 'జ్ఞాన' మని అనుభవజ్ఞులైన మహాత్ములు చెప్పిరి.

శ్లో. నిర్వికారో నిరాకారో । నిరవద్యోఽహమవ్యయః
నాహం దేహోహ్యసద్రూపో। జ్ఞానమిత్యుచ్యతే బుధైః

తా. నేను నిర్వికారుడను (సుఖ దుఃఖ స్తుతి నిందాది ద్వంద్వములకు చలించువాడనుగాను), నేను నిరాకారుడను, నేను నిరవద్యుడను (తాపత్రయములు లేనివాడను), నేను నాశరహితుడను, అనిత్యమైన ఈ దేహము నేను గాను, అనెడి నిశ్చయమే 'జ్ఞాన' మనబడును.

శ్లో. నిరామయో నిరాభాసో । నిర్వికల్పోఽహ మాతతః
నాహం దేహో హ్యసద్రూపో। జ్ఞాన మిత్యుచ్యతేబుధైః॥

తా. నేను నిరామయుడను (రోగము లేనివాడను), నేను నిరాభాసుడను (ఆభాసరహితుడను), నిర్వికల్పుడను, అంతటా వ్యాపించినవాడను కనుక నశించిపోవునట్టి ఈ దేహము నేను గాను అనెడి నిశ్చయానుభూతి నొందుటయే 'జ్ఞాన' మగునని సద్గురువులు చెప్పిరి.

శ్లో. నిర్గుణో నిష్క్రియో నిత్యో। నిత్యముక్తోఽహ మచ్యుతః
నాహం దేహో హ్యసద్రూపో। జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

తా. నేను సత్వ రజ స్తమో గుణములు లేనివాడను, నేను నిష్క్రియుడను (ఏపనిని చేయనివాడను), నిత్యుడను, నిత్యముక్తుడను, నాశనము లేనివాడను, ఈ దేహములు (స్థూల సూక్ష్మ కారణ శరీరములు) నేనుగాను

అని నిశ్చయము గలిగియుండుటయే జ్ఞాన మనబడునని జ్ఞానులు చెప్పిరి.

శ్లో, నిర్మలో నిశ్చలోఽనంతః। శుద్ధోఽహ మజరోఽమరః
నాహం దేహో హ్యసద్రూపో। జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

తా. నేను పుణ్యాపాపాది మలదోషములు లేనివాడను, చలనము లేనివాడను, నేను పరిమితిలేనివాడను, పరిశుద్ధుడను, ముదుసలితనము లేనివాడను, మరణములేనివాడను, ఈ దేహములు అస్థిరములగుటచేత నేను గాను అని నిశ్చయించుకొని యుండుట 'జ్ఞాన' మని చెప్పబడుచున్నది. (అపరోక్షానుభూతి)

## జ్ఞానము (మొదటిపద్ధతి)

శ్లో. సర్వపాపేషు నష్టేషు, బుద్ధి ర్భవతినిర్మలా
సైవబుద్ధి స్సమాఖ్యాతా, జ్ఞానశబ్దేన సూరిభిః॥

తా. సమస్తపాపములును నశించిపోయినపుడు బుద్ధి కామక్రోధాది మలిన గుణములు లేనిదై నిర్మలమగును. నిర్మలమైన పరిశుద్ధబుద్ధి గలిగియుండుటయే 'జ్ఞాన'మగునని పెద్దలు చెప్పిరి.

శ్లో. తావదేవ నిరోద్ధవ్యం యావద్హృది గతంక్షయం
ఏతత్ జ్ఞానమ్......................

తా. హృదయములో ఎంతవరకు సంకల్పములు పుట్టుచుండునో అంతవరకును ఆ సంకల్పములను నిగ్రహించుచుండవలయును. ఇదియే జ్ఞానము.

శ్లో. బహిర్ముఖాని సర్వాణి కృత్వాచాభిముఖానివై
ఏతత్ జ్ఞానమ్......................

తా. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనో బుద్ధులును లోక (సంసార) విషయముల వైపునకు పోవు చున్నంతవరకును ఆ యింద్రియములను నిగ్రహించి అంత ర్ముఖము జేయుచుండ వలయును. ఇదియే జ్ఞానము.

"తద్ధ్యానం ప్రశమకరం య దింద్రియాణామ్"

తా. మానసాదీంద్రియములను చెడువిషయముల లోనికి పోనీయక నిగ్రహించుట (ప్రశాంతస్థితిలో నుండునట్లు చేయుట) జ్ఞాన మగును. (సదాచారము)

శ్లో. అంతర్యాతా మతి ర్విద్వన్, బహిరాయాతి చే త్పునః
అభ్యాసమేవతా మాహుః, జ్ఞానం హ్యానుభవోచ్యుతః॥

తా. ఓ విద్వాంసుడా! లోపల ప్రవేశించిన బుద్ధి మరల వెలుపలకు వచ్చుచున్నదాయెనా, దానిని అభ్యాస మనియే చెప్పుదురు. పరమాత్మస్థితినుండి జారని యను భవమే జ్ఞానమని చెప్పబడుచున్నది. (రమణగీత)

"సర్వభూత సమత్వేన లింగే నజ్ఞాన ముహ్యతామ్"

తా. అన్నిప్రాణులయందును పక్షపాతము లేక (భేద బుద్ధి లేక) చూచుట యనునదే జ్ఞానముగల మానవులకు గుర్తు యనబడును.

"బ్రహ్మజ్ఞానం సమూలా నాత్మనివర్తకం సద్బ్రహ్మణి విలీయతే"

తా. పూర్తిగా (మానసాదీంద్రియములే నేను అనెడి) అనాత్మ (అజ్ఞాన) భావములు నశించి, పరబ్రహ్మమునందు జీవత్వము విలీనమగుటయే బ్రహ్మజ్ఞాన మగును.

(సర్వసారోపనిషత్తు)

"ఆత్మానాత్మవివేకస్య జ్ఞానమాహుర్మనీషిణః" (సదాచారం)

తా. ఆత్మ యిది (నిత్యమైన దిది), అనాత్మ యిది (అనిత్యమైన దిది) అని విభాగించుకొని యుండుట జ్ఞాన మగు నని పెద్దలు చెప్పుదురు.

"క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం తద్ జ్ఞానం జ్ఞాన ముచ్యతే"

తా. శరీరము యొక్కయు (అనగా స్థూల, సూక్ష్మ కారణ శరీరములే క్షేత్ర మనబడును గాన దీనియొక్కయు), ఈ శరీరత్రయములను త్రికాలములయందును తెలిసికొనుచు అసంగమైయుండు ఆత్మ (క్షేత్రజ్ఞుని) యొక్కయు నిజతత్త్వము నెరెంగియుండుట జ్ఞాన మనబడును.

"అజ్ఞాననాశకత్వే సతి స్వాత్మబోధకత్వం జ్ఞానమ్"

తా. దేహేంద్రియాదులే నేను యను అజ్ఞానము నశించిపోగా ఆత్మయొక్క నిజస్వరూపానుభవము గలిగి యుండుట జ్ఞాన మగును. (సదాచారము)

"చేతనాచేతనాన్యత్వ విజ్ఞానం జ్ఞాన ముచ్యతే"

తా. చైతన్యస్వరూపమగు పరమాత్మ యొక్కయు జడరూపములగు (అచేతనములగు) దేహేంద్రియ మనో

బుద్ధ్యాదుల యొక్కయు యథార్థమును అనుభవములో నుంచుకొనుట జ్ఞాన మగునని చెప్పబడును.

"స్వరూపావస్థితిం శుద్ధాం జ్ఞానమాహుర్మనీషిణః"

తా. పరిశుద్ధస్వరూపమగు స్వాత్మయందుండుటయే జ్ఞాన మగునని అనుభవజ్ఞులు చెప్పిరి. (రమణగీత)

"అహింసా పరమం జ్ఞానమ్"

తా. తనకున్ను, ఇతరులకున్ను ఇప్పుడుగాని, భవిష్యత్తులోగాని బాధగలుగని ప్రవర్తన, సద్గుణములును గలిగి యుండుట శ్రేష్ఠమైన జ్ఞాన మగును.

"స్వాతంత్ర్యం జ్ఞాన ముచ్యతే"

తా. ఈ సృష్టిలో (జగములో) శబ్దములకుగాని, రూపములకుగాని, క్రియలకుగాని కట్టుబడక లేక బాధింపబడక లేక చలనమొందక యుండుట జ్ఞాన మగునని చెప్పబడుచున్నది.

"అభేద దర్శనం జ్ఞానమ్"

తా. స్త్రీ పురుష, పశు పక్షి, మృగ వానర, మన్ను బంగారము మొదలగు భేదభావములులేక సమత్వభావముతో చూచుచుండుట జ్ఞాన మనబడును.

"కర్తవ్యాఽకర్తవ్య వివేకం జ్ఞానమ్"

తా. ఇది మంచి ఇది చెడు, ఈపని యిప్పుడు చేయదగినది, ఈపని యిప్పుడు చేయరాదు, ఈమాటలు పలుకదగినవి, ఈమాటలు పలుకరాదు అని విచారణ

చేసి, తెలిసికొని అకర్తవ్యములను వదలి కర్తవ్య కర్మలనే చేయుచుండుట జ్ఞానము.

"వస్తు తంత్రం భవేత్ జ్ఞానమ్"

తా. ఉన్నవిషయమును ఉన్నట్లుగా గ్రహించుట జ్ఞాన మగును. అనగా, చైతన్య వస్తువును చైతన్యమనియు, జడవస్తువును జడమనియు గాంచుట (గ్రహించుట) జ్ఞాన మగును.

## ఏకైకజ్ఞానము

"సమత్వం జ్ఞాన ముచ్యతే"

తా. అభేద (అఖండ) దృష్టి గలిగియుండుట జ్ఞానము.

"స్వప్రకాశం జ్ఞానమ్"

తా. తనంతట ప్రకాశించునది జ్ఞానము.

"సర్వప్రకాశకం జ్ఞానమ్"

తా. సమస్తమును ప్రకాశింప (తెలియ) జేయునది జ్ఞానము.

"నిరావరణ చిన్మాత్రం జ్ఞానమ్"

తా. ఆవరణ దోషములేని చిన్మాత్రస్వరూపము జ్ఞానము.

"అనా ద్యనంతం నిరంతర మవృత్తి వృత్తిసాక్షి
చైతన్యం జ్ఞానమ్"

తా. అనాదిగను, అనంతముగను, నిరంతరముగను, సంకల్పవృత్తిలేనిదిగను, మనోవృత్తికి సాక్షిగ నుండు చైతన్యమే జ్ఞానము.

## జ్ఞానద్వయము

శ్లో. ఆగమోక్తం వివేకోత్థం, ద్విధాజ్ఞానం ప్రచక్షతే
శబ్దబ్రహ్మాగమ మయం, పరబ్రహ్మ వివేకజమ్ ॥

తా. శాస్త్రముచే చెప్పబడిన (తెలియబడిన) జ్ఞానమనియు, వివేకముచే గలిగిన జ్ఞానమనియు, జ్ఞానమనునది రెండు విధములు. శబ్ద బ్రహ్మము శాస్త్రమయము. పరబ్రహ్మ జ్ఞానము వివేకమయ మనబడును. (గరుడపురాణము)

## జ్ఞానత్రయము

శ్లో. స్వజ్ఞానం ప్రాపకజ్ఞానం, ప్రాప్యజ్ఞానం ముముక్షుభిః
జ్ఞానత్రయ ముపాదేయ, మేతదన్య న్నకించన ॥

తా. స్వజ్ఞానము అనగా, జీవుడైన తనరూపము నెరుగుట. ప్రాపకజ్ఞానము అనగా, భగవంతుని పొందించే ఉపాయముల నెరుంగుట. ప్రాప్యజ్ఞానము అనగా, భగవంతుని ధ్యానించుటవలన లభించే స్థానము (దివ్యసుఖము) ఇది యని యెరుంగుటయు నగు నీ మూడు విధములగు జ్ఞానములను ముముక్షువులు తెలిసికొని మరువక యుండవలయును. ఇంతకంటే వేరేమియు లేదు.

## అద్వైతత్రయము

శ్లో. భావాద్వైతం క్రియాద్వైతం, ద్రవ్యాద్వైతం తథైవ చ
అద్వైతం త్రివిధా ప్రోక్తా, నాద్వైతం గురు సన్నిధౌ ॥

తా. భావాద్వైతము, క్రియాద్వైతము, ద్రవ్యాద్వైతము అని అద్వైతము మూడు విధములుగా నుండునని

చెప్పబడుచుండును. కాని గురుదేవుని దగ్గర మాత్రము అద్వైతవర్తన కూడదు.

భావాద్వైత మనగా, సర్వ నామ రూప క్రియలును పరబ్రహ్మస్వరూపమే యను నిశ్చయభావము, క్రియా ద్వైతమనగా, తానుచేయుచున్న, చేసిన, చేయబోవు పనుల నన్నిటిని కర్తృత్వము లేకుండ "కృష్ణార్పణమస్తు" యను భావము గలిగియుండుట. ద్రవ్యాద్వైతమనగా, సర్వ నామ రూపములును పంచమహాభూతములమయమేయనిభావించుట.

దైవాత్మభావముతో ఆనందించుచుండువారు 'జ్ఞాని' లనబడుదురు.

సత్కర్మలతో సంతోషించుచుండువారు 'భక్తు' లనబడుదురు.

"బ్రహ్మజ్ఞానం సాత్త్వికమ్
ధర్మజ్ఞానం రాజసమ్
కర్మజ్ఞానం తామసమ్॥"

తా. సర్వత్ర పరిపూర్ణముగా వెలుగుచున్న పరబ్రహ్మ మును సర్వత్ర గాంచుట (అనుభవము గలిగియుండుట) సాత్త్వికజ్ఞాన మనబడును.

లోకములో (మానవాది జీవులలో) ధర్మమునే, మంచి గుణములనే వెదకుట, గాంచుటయును రాజసజ్ఞాన మన బడును.

లోకములో (మానవులలో) పుణ్య పాప కర్మలను వెదకుట, బ్రహ్మచర్యాశ్రమమని, గృహస్థాశ్రమమని, వాన ప్రస్థాశ్రమమని, సన్న్యాసాశ్రమమని, బ్రాహ్మణ క్షత్రియ

వైశ్య శూద్ర జాతులనియు, స్త్రీ పురుషులనియు, నాది నీది యని యును భేద వ్యవహార నియమములతో ప్రవర్తించుచుండుట కర్మజ్ఞాన మనబడును. (అనగా తామసజ్ఞాన మగును.)

## జ్ఞానపంచకము

1. పరమాత్మ స్వరూపము అనగా, మనోబుద్ధ్యాదీంద్రియముల వృత్తులను తెలిసికొనుచున్న చైతన్యము.

2. జీవాత్మస్వ రూపము అనగా, సుఖదుఃఖములను అనుభవించే చైతన్యము.

3. విరోధి స్వరూపము అనగా, కామ క్రోధ లోభ మద మాత్సర్యాది గుణములు.

4. ఉపాయ స్వరూపము అనగా, దైవపూజ, గురు సేవ, భగవన్నామసంకీర్తన, జపము, ధ్యానము, విచారణలు యగును.

5. ఫల స్వరూపము అనగా, దుఃఖము నశించుట, బ్రహ్మానందానుభవము స్థిరమగుటయు నగును.

# 18. అజ్ఞానమనగానేమి?

(శంకరులు)

శ్లో. ఆత్మావినిష్కలో హ్యేకో, దేహో బహుభిరావృతః
తయోరైక్యం ప్రపశ్యంతి, కిమజ్ఞాన మతఃపరమ్ ॥

తా. ఆత్మ అవయవములు లేనిది. ఏకైకస్వరూప మైనది. దేహ మన్ననో అనేక అవయవములతో కూడినది.

అయినప్పటికిని దేహామే తామని తలంచుకొనుచున్నారు. ఇంతకంటె వేరుగా అజ్ఞాన మే మున్నది!

శ్లో. ఆత్మానియామకశ్చాంతః, దేహోబాహ్యో నియమ్యకః
తయోరైక్యం ప్రపశ్యంతి, కి మజ్ఞాన మతఃపరమ్ ॥

తా. ఆత్మ యజమానునివలె నియమించును. మనో బుద్ధుల యొక్క లోపల యుండును. దేహ మన్ననో వెలుపల యుండును. ఆత్మకు లోబడి యుండును. ఇట్లుండగా దేహామే ఆత్మయని భావించుటకంటె అజ్ఞాన మింకేమున్నది!

శ్లో. ఆత్మాజ్ఞానమయః పుణ్యో, దేహో మాంసమయోఽశుచిః
తయోరైక్యం ప్రపశ్యంతి, కి మజ్ఞాన మతఃపరమ్ ॥

తా. ఆత్మ జ్ఞానమయుడును, పుణ్యస్వరూపుడు నై యున్నాడు. దేహామైతేనో మాంసమయము. మలమూత్ర రక్తాదులతో మలినము నై యున్నది. ఇట్లుండగా దేహాము, ఆత్మయు ఒకటె ననుకొనుటకంటె అజ్ఞాన మింకేమి కలదు?

శ్లో. ఆత్మా ప్రకాశకః స్వచ్ఛో। దేహ స్తామస ఉచ్యతే
తయోరైక్యం ప్రపశ్యంతి। కి మజ్ఞాన మతఃపరమ్ ॥

తా. ఆత్మ ప్రకాశస్వరూపమగును. దేహాము ఆత్మ ప్రకాశముచే తెలియబడుచుండును (చలించుచుండును). ఇట్లుండగా ఆ రెంటికిని ఐక్యమును తెలిసికొనుచున్నారు. యింతకంటె వేరుగా అజ్ఞాన మే మున్నది!

శ్లో. ఆత్మానిత్యోహిసద్రూపో, దేహోఽనిత్యోహ్యసన్మయః
తయోరైక్యం ప్రపశ్యంతి, కి మజ్ఞాన మతఃపరమ్ ॥

తా. ఆత్మ ఎల్లప్పుడు నుండునదియు, నశించక యుండు నదియు నగును. దేహ మన్ననో అనిత్యమైనదియు, నశించి పోవునదియు నగును. అట్టిచో దేహాత్మల రెంటి నొక్కటిగా గాంచుటకంటె అజ్ఞానము వేరుగా నేమున్నది!

"అనాదిభావత్వే సతి జ్ఞాన నివర్త్యత్వ మజ్ఞానమ్"

తా. అనాదియై, భావరూపమై జ్ఞానమువలన నశించునది అజ్ఞాన మనబడును.

"దేహోహమితి యజ్ఞానం త దేవాఽజ్ఞాన ముచ్యతే"

తా. అనిత్యమైన ఈ దేహమే నేను యను నిశ్చయబుద్ధి యేది గలదో అదే అజ్ఞాన మని చెప్పబడును.

మూలం : రజ్జౌ సర్పభ్రాంతి రివాఽద్వితీయే సర్వానుస్యూతే సర్వమయే బ్రహ్మణి దేవ తిర్యక్ నర స్థావర స్త్రీ పురుష వర్ణాశ్రమ బంధ మోక్షోపాధినానాత్మ భేద కల్పితం జ్ఞాన మజ్ఞానమ్.

తా. ఏకైక స్వరూపమును, సర్వత్ర వ్యాపించినదియును, సర్వ జగన్మయముగ నున్నదియును అగు పరబ్రహ్మమందు రజ్జుసర్ప న్యాయము రీతిగా దేవతలు, పశువులు, పక్షులు, మృగములు, నరులు, చెట్లు, స్త్రీ పురుషులు, వర్ణభేదములు, ఆశ్రమభేదములు, బంధము, మోక్షము మొదలగు నానాభేదభ్రాంతుల గల్పింపజేసికొనుటయే అజ్ఞాన మనబడును.

# 19. జ్ఞానము కలుగకుండుటకు కారణములెవ్వి ?

( సూతసంహితనుండి )

శ్లో. మాతృసంరక్షణా భావో, మాతృద్రోహశ్చ కేశవ
మాతృసంతాపకారిత్వం, జ్ఞానా నుత్పత్తికారణమ్ ॥

తా. తల్లిని పోషింపక పోవుటచేతను, తల్లికి ద్రోహము కలిగించుటచేతను, తల్లిని బాధపెట్టుటచేతను జ్ఞానము కలుగకపోవుటకు కారణము లగును.

శ్లో. పితృద్రోహశ్చ శుశ్రూషాఽ భావ స్తస్య తథైవ చ
పితృసంతాపకారిత్వం, జ్ఞానా నుత్పత్తికారణమ్ ॥

తా. తండ్రికి ద్రోహముచేయుటచేతను, తండ్రికి సేవచేయక బాధలు కలుగజేయుటచేతను జ్ఞానము కలుగక పోవుటకు కారణము లగుచున్నవి.

శ్లో. అభక్ష్య భక్షణే శ్రద్ధా, తథాఽ భక్ష్యస్య భక్షణమ్
అభక్ష్య భక్షక స్పృష్టిః, జ్ఞానా నుత్పత్తికారణమ్ ॥

తా. తినకూడని పదార్థములను తినుటచేతను (అనగా తామస రాజ సాహారములను, అధర్మమార్గమున సంపాదింపబడినవియు, ఉచితముగా యితరులు పెట్టినవియు నగు ఆహారములను తినుటచేతను ), తినదగిన న్యాయార్జిత సాత్త్వికాహారమును తినకపోవుట చేతను, పాపాహారమును భుజించువారితో స్నేహము చేయుటచేతను జ్ఞానము కలుగకపోవుటకు హేతువు లగుచున్నవి.

శ్లో. గురో రనిష్టాచరణం, గురో రిష్టవివర్జనమ్
గురోశ్చ సేవాకరణం, జ్ఞానా నుత్పత్తికారణమ్ ॥

తా. గురువునకు ఇష్టములేనిపనులు జేయుటచేతను, గురువునకు యిష్టమైనపనులను చేయకుండుట చేతను, గురువునకు సేవచేయకపోవుటచేతను జ్ఞానము కలుగకపోవుటకు కారణము లగుచున్నవి.

శ్లో. ఆచార్యే బాల బుద్ధిశ్చ, నరబుద్ధి స్తథైవ చ
అనిష్ట బుద్ధి ర్యాభావాథ, జ్ఞానా నుత్పత్తి కారణమ్ ॥

తా. గురువును చిన్నబుద్ధితో చూచుటచేతను (అనగా, కులము తక్కువ యనిగాని, వయస్సు తక్కువ యనిగాని, విద్య తక్కువయనిగాని, ఐశ్వర్యము తక్కువయనిగాని, గౌరవబుద్ధి లేకుండుటచేతను), గురువును సామాన్యమానవునిగా (అనగా, దేవునిగా గాక నరునిగా) తలంచుట (చూచుట) చేతను, గురువుపై విశ్వాసములేకపోవుట చేతను జ్ఞానము కలుగకపోవుటకు కారణము లగుచున్నవి.

శ్లో. ఆచార్య నిందా శ్రవణం, త ద్బాధన్యచ దర్శనం
వివాదశ్చ తథా తేన జ్ఞానా నుత్పత్తికారణమ్ ॥

తా. గురుదేవుని ఇతరులు నిందించుచుండగా ప్రీతితో వినుటచేతను, గురువును యితరులు బాధించుచుండగా చూచుచు ఊరకుండుటచేతను, గురువుతో వివాదము పెట్టుకొనుటచేతను జ్ఞానము కలుగకపోవుటకు కారణము లగుచున్నవి.

శ్లో. ఆచార్యేఽనీశ్వరజ్ఞాన, ముపేక్షా చ తథైవ చ
తదుక్త విస్మృతిశ్చాపి జ్ఞానా నుత్పత్తికారణమ్ ॥

తా. గురువు సాక్షాత్తుగా పరమేశ్వరస్వరూపుడే యను నిశ్చయము లేకపోవుటచేతను, గురువుయెడ ఉపేక్షా భావము గలిగియుండుటచేతను, గురువుచెప్పిన సత్య ధర్మాది జ్ఞాన నియమములను మరచిపోవుటచేతను జ్ఞానము కలుగక పోవుటకు కారణము లగుచున్నవి.

## జ్ఞానమును కలుగనీయని శత్రువు లెవ్వి ?

శ్లో. ఆలస్య మనృతం శాఠ్యం, జాడ్యం నిందా ప్యనుద్యమః
షడేతే మంత్రిణ స్తస్య జ్ఞానద్వార విరోధినః ॥

తా. 1. ఆలస్యము (జాగు) 2. అసత్యభాషణ 3. మూర్ఖత్వము (అనగా తనకు తోచినదే, తాను చేయు చున్నదే సత్యము, ధర్మము యని వదలని మొండి పట్టుదల) 4. వ్యాధులు 5. పరుల నిందించు స్వభావము 6. పాప నివృత్తికిని, పుణ్యప్రాప్తికిని ప్రయత్నము చేయని స్వభావము అను నీ యారును జ్ఞాన ( మోక్ష ) ద్వారమున నడువనీయక అడ్డమువచ్చు శత్రువు లనబడును. కనుక భక్తులును, ముముక్షువులును వీటిని జయించవలయును.

శ్లో. తీర్త్వా మోహార్ణవం హత్వా రాగద్వేషాది రాక్షసాన్
యోగీ శాంతి సమాయుక్తో, ఆత్మారామో విరాజితే॥

తా. మోక్షసాధనపరుల కర్తవ్య మేమనగా ( పుత్ర మిత్ర ధనాదులపైగల) మోహ మనెడి సముద్రమును దాటి,

రాగద్వేషాదిదుర్గుణము లనెడి రాక్షసులను వివేక వైరాగ్యము లనెడి బాణములతో చంపి, శాంతి యనెడి సీతను గ్రహించి, హృదయ మనెడి అయోధ్యానగరమును చేరి బ్రహ్మానందముతో ప్రకాశించు చుండవలయును.

## 20. పాపులెవరు?

స్వాత్మ స్వరూప జ్ఞానములేని వారందరును పాపులే. దుఃఖమే పాపఫలము. భేదదృష్టిలోనే దుఃఖము (బాధ) కలదు.

పాపముచేయనివారే సన్యాసులు అని బుద్ధుడు చెప్పెను.

ఇతరులకు బాధగలిగించుట పాప మగునని కర్మ యోగము చెప్పును.

భగవంతుని మరచుట పాప మని భక్తియోగము చెప్పును.

సంకల్పములు, ఇచ్ఛలు పుట్టుట పాప మగునని ధ్యానయోగ మనును.

అఖండాత్మను మరచుట పాప మగునని జ్ఞానయోగము చెప్పును.

దేహాభిమానమే గొప్ప పాప మగును. నిన్ను ఎవరైనను 'ఓ పాపీ, ఓ మూర్ఖుడా, ఓ దుష్టుడా, ఓ దొంగా' యని అనినచో నీకు క్రోధము, బాధ గలుగనిచో నీలో పాపము నశించినదని చెప్పవచ్చును.

